Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 48 • 2-12-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# విఆర్ కాలేజీ ఆనంవారి అబ్బసొత్తా?

## • దాన్ని క్రైస్తవ సంస్థగా మార్చే అధికారం వారికెవరిచ్చారు?

నెల్లూరు విఆర్ కాలేజిని క్రైస్తవ మత సంస్థగా మార్చడానికి కుట్ర పన్నుతున్నారు ఆనం సోదరులు. ఇది అపోహ కాదు, నిజం. విఆర్ కాలేజి విస్తరణకు ఉన్న చోటు చాలక పోవడంతో, భక్తవత్సలరెడ్డి కమిటీ నిర్వాహకుడిగా ఉన్న సమయంలో వైఎంసిఏ చర్చి ప్రాంగణాన్ని కొనుగోలు చేశాడు. దాదాపు మూడు దశాబ్దాలపాటు అది ఖాళీగానే ఉండింది. ఇటీవల ఆనం వివేకానందరెడ్డి ఆ స్థలంలో కొన్ని భవనాలు నిర్మిస్తున్నాడు. అవి దేనికోసం, వాటిలో కాలేజికి సంబంధించిన ఏ విభాగం నడుపుతారో చెప్పేవారు లేరు. ప్రిన్సిపాల్‌ను అడిగితే నాకేమీ తెలియదని సమాధానం. కాలేజి లైజనింగ్ ఆఫీసర్‌ని అడిగితే మీరు వివేకానందరెడ్డితోనే మాట్లాడండి అని బదులిచ్చాడు. ఆ భవనాల ఆర్కిటెక్చర్ సమస్తం ఒక చర్చ్‌ను పోలి ఉన్నది. పైన శిలువ ఒకటి అతికిస్తే చాలు చూసేవారు దాన్ని చర్చ్ అనే అనుకొంటారు తప్ప కాలేజి భవనం అనుకోరు. ఆ కొరత తీర్చడానికి కాబోలు ఆ ప్రాంగణం ముందు భాగంలో ఒక భారీ ద్వారాన్ని నిర్మించి దానికి ఎగువ భాగంలో ఏసు ప్రభువు పిల్లలతో సంభాషిస్తున్న రాతి శిల్పాన్ని అమర్చారు.

### 135 ఏళ్ల చరిత్ర

విఆర్ కాలేజి ఆనం వారి అబ్బ సొత్తేమీ కాదు. దానివెనుక నూట 135 ఏళ్ల సుదీర్ఘమైన, ఉత్కృష్టమైన చరిత్ర ఉంది. ఎందరో మహనీయుల త్యాగం, అంకిత భావం, ఆశయబలం ఉన్నాయి. దాని చరిత్ర వింటే నెల్లూరీయుడనే వాడికల్లా వళ్లు పులకరించడం ఖాయం. 1875కు మునుపు నెల్లూరు నగరంలో ఆ మాటకొస్తే నెల్లూరు జిల్లా మొత్తంలో సిఎఎం స్కూల్ ఒక్కటే పాఠశాల. చదువుకోవాలనే కోరిక ఉన్న వారెవరైనా అక్కడకు వెళ్లాల్సిందే. అయితే అందులో చదివే ప్రతి పిల్లవాడి చేత పొద్దున్నే క్రైస్తవ మత కీర్తనలు పాడించేవారు. ఆనాటికి నెల్లూరు జిల్లా మొత్తంమీద బిఏ చదివిన ఏకైక విద్యావంతుడు సుంకు నారాయణశెట్టి గారిని ఆ స్కూలు యాజమాన్యం తమ ఉపాధ్యాయుడిగా నియమించింది. కానీ కొద్ది కాలంలోనే ఆయన హిందు పిల్లల చేత క్రీస్తు కీర్తనలు పాడించే సాంప్రదాయాన్ని అభ్యంతర పెట్టాడు. దానితో ఆనాటి ప్రిన్సిపాల్ రెవరెండ్ జాన్ మెక్మిలన్ ఆయన్ను ఉపాధ్యాయ ఉద్యోగం నుంచి తొలగించారు.



విఆర్ విద్యాసంస్థల విస్తరణలో భాగంగా వైఎంసిఎ గ్రౌండ్స్‌లో చర్చిని పోలివున్న నిర్మాణం.

### హిందువుల స్కూల్‌కు మహమ్మదీయుడి విరాళం!

ఈ అంశం ఆనాటి నెల్లూరు పుర ప్రముఖులలో తీవ్ర అలజడి రేపింది. హిందువులకు ఒక



ముందుభాగంలో ఏర్పాటు చేసిన ఏసు ప్రభువు విగ్రహం.

స్వంత స్కూల్ ఉండాలనే సంకల్పం కల్గించింది. ఆనాటి కలెక్టరేట్ హుజూర్ శిరస్తాదారు ఆర్.వెంకట కృష్ణారావు, డిప్యూటీ కలెక్టర్ ఆడక్కి నారాయణ రావు, జిల్లా మునిసిఫ్ కందాడై రంగమన్నార్ వంటి ప్రముఖులు సుంకు నారాయణశెట్టిని కలిసి, ఈ ప్రతిపాదన తెచ్చారు. దానికి ఆయన సుముఖత వ్యక్తం చేయడంతో కలెక్టరేట్ పక్కన నెలకు మూడు రూపాయల బాడుగ లెక్కన ఒక చిన్న భవనం అద్దెకు తీసుకొని "హిందు ఆంగ్లో వర్నాక్యులర్ స్కూల్" పేరిట కొత్త పాఠశాల ప్రారంభించారు. దానిపై క్రైస్తవ మత పెద్దలు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. పిల్లలను సిఎఎం స్కూల్ నుంచి బలవంతంగా ఎత్తుకొని వెళ్తున్నారని, మత దురాభిమానంతో హిందు పాఠశాల ప్రారంభించారని జిల్లా కలెక్టర్‌కు ఫిర్యాదు చేశారు. దాన్ని మూయించాలని ఒత్తిడి తెచ్చారు. అప్పటి కలెక్టర్ వాన్ డి హరిడింగే, వారి వాదన సమ్మతించి, నారాయణశెట్టి గారిని హింసించడం మొదలు పెట్టాడు. అయితే అదృష్టవశాత్తు ఆయన బదలీ అయ్యి, ఆయన స్థానంలో వచ్చిన కొత్త కలెక్టర్ వాన్స్ ఆగ్నే క్రైస్తవ మత పెద్దల వాదనను తిరస్కరించాడు. దీనికి సంబంధించి ఆయన వ్రాసిన నివేదిక ఎంతో గొప్పది. "ప్రభుత్వ విద్యలో తతిమా జిల్లాలతో పోలిస్తే నెల్లూరు చాలా నష్టపోతున్నది. నెల్లూరు పౌరులు తమ పిల్లలను క్రైస్తవ పాఠశాలకు పంపడానికి ఇష్టపడడం లేదు. తమ స్కూల్‌లో చదివే పిల్లలందరి చేత మత మార్పిడి చేయించే ఏకైక ఉద్దేశంతో ఆ స్కూల్‌లో జరుగుతున్న మత ప్రబోధాలు నెల్లూరు పౌరుల ఆత్మగౌరవాన్ని దెబ్బ తీస్తున్నాయి. దాన్ని సరిదిద్దవలసిన బాధ్యత ప్రభుత్వం మీద ఉంది"

కొరవ 14వ పేజీలో

## అహ్మద్‌పటేల్‌తో జగన్ రాయబారం!

వైఎస్.జగన్ పునరాలోచనలో పడ్డాడా? ఒకపక్క చుట్టుముడుతున్న సిబిఐ కేసుల బెడద, మరొకప్రక్క ఎమ్మెల్యేల మీద పట్టు జారి పోతున్న బలహీన స్థితి, ఇంకొక పక్క ఇంత కాలం ఆర్థికంగా నిధుల వరద పారించిన వ్యాపార, పారిశ్రామిక వర్గాలన్నీ తనకు ముఖం చాటేస్తున్న తీరు జగన్‌ను వుక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. సిబిఐ అధికారులు చాపక్రింద నీరు వలె వ్యవహరిస్తున్నారు. జగన్‌తో సంబంధం వున్న వారందరినీ పిలిపించుకొని, నిశితమైన ప్రశ్నలతో సమాచారం రాబడుతున్నారు. ఈ క్రమంలో ఎక్కడ ఎవరు ఏ చిన్నపాటి ఆధారం సమర్పించినా జగన్ జైలుకు వెళ్లే రోజు ముందుకు వచ్చేస్తుంది. ఇప్పటికే వారి వద్ద పొద్దుటూరు మాజీ ఎమ్మెల్యే వరదరాజుల రెడ్డి కుమారుడు కొండారెడ్డి ఇచ్చిన వాంగ్మూలం వుంది. గాలి జనార్దనరెడ్డికి అనుకూలంగా గనుల లీజు దరఖాస్తును ఉపసంహరించుకోవాలని తనపై ఒత్తిడి తెచ్చాడని, తుపాకీ కణతకు ఆనించి చంపుతానని

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్




మొదటి పేజీ వెన్నుపోటు, తర్వాత అధికారం, పాలనలో ఆకలి చావులు, సాఫ్ట్‌వేర్ వైపు పరుగులు, కోట్లకు ఎదిగిన సంపద, చివరి పేజీ ప్రతిపక్షం.

# చిల్లర వర్తకంలో విదేశీ పెట్టుబడులు

చిల్లర వర్తకంలోకి విదేశీ పెట్టుబడులను అనుమతించాలని ప్రధాని మన్మోహన్‌సింగ్ చేసిన ప్రతిపాదనపై విమర్శలొస్తున్నాయి. ప్రధాన ప్రతిపక్షం బిజెపి ఈ ప్రతిపాదనను తీవ్రస్థాయిలో వ్యతిరేకిస్తున్నది. కాంగ్రెస్ మిత్ర పక్షాలైన డిఎంకె, తృణమూల్ కాంగ్రెస్‌లు కూడా ఈ విషయంలో బిజెపితో వంత పాడుతున్నాయి. ఈ అంశంపై చర్చ జరగాలని పట్టుబట్టిన బిజెపి నాయకత్వం, పార్లమెంట్‌లో వాయిదా తీర్మానం ప్రతిపాదించాయి. వాయిదా తీర్మానం అంటే, చర్చ చివర ఓటింగ్ పెడతారు. ఆ తీర్మానం ఆమోదం పొందితే, మన్మోహన్ సింగ్ ప్రభుత్వం రాజీనామా చేసి, ఇంటికి పోవలసి వుంటుంది. చివరి వరకు డిఎంకె, తృణమూల్ కాంగ్రెస్ పార్టీలు ఇదే పట్టుదలతో వుంటే అదే జరుగుతుంది. ఆ ప్రమాదం తప్పించుకోవడానికి కేంద్ర ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ గత మూడు రోజులుగా తన రాయబార కళలన్నీ ప్రదర్శిస్తున్నాడు. అఖిలపక్ష సమావేశాలు జరిపి వాయిదా తీర్మానాన్ని ఉపసంహరింప చేయడంలో విఫలం కావడంతో డిఎంకె, టిఎంసిలను తన దారికి తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

చిల్లర వర్తకంలో విదేశీ పెట్టుబడులు, దేశ భవిష్యత్తును ప్రభావితం చేసే అంశం. మన దేశంలో దాదాపు పాతిక లక్షల కోట్ల రూపాయలుగా వుంటుందని అంచనా. ఇందులో నూటికి తొంభై పాళ్లు చిన్న చిన్న కుటుంబాల చేతులలోనే వుంది. వీధి చివర కిరాణా అంగళ్లలోనే కోట్లాది మంది భారతీయులు తమ నిత్యావసర వస్తువుల కొనుగోలు చేస్తున్నారు. మన దేశంలో వ్యవసాయం తర్వాత, ఈ చిల్లర వర్తకంలోనే అత్యధిక జనాభా ఉపాధి పొందుతున్నది. ఇటీవల రిలయన్స్ వంటి కార్పొరేట్ సంస్థలను ఈ రంగంలోకి అనుమతించడంతో, ప్రతి పట్టణంలో సూపర్ మార్కెట్లు పుట్టుకొచ్చాయి. వాటి వల్ల ఇప్పటికే చాలా నగరాలలో చిల్లర దుకాణాలు అంతరించి పోతున్నాయి. భారతీయ కార్పొరేట్లకు తోడు, విదేశీ కంపెనీలను కూడా ఈ రంగంలో అనుమతించాలన్నది ప్రధాని ప్రతిపాదన. విదేశీ కంపెనీలు ఈ వ్యాపారంలోకి వస్తే, నేరుగా రైతుల నుంచి ధాన్యం, కూరగాయలు, ఫలసరకులు, పప్పు దినుసులు వంటివి కొనుగోలు చేసి దళారీ వ్యవస్థను నిర్మూలిస్తారని, దానితో రైతులకు గిట్టుబాటు ధర లభిస్తుందని ప్రధాని చెప్తున్నాడు. విదేశీ కంపెనీలు నెలకొల్పే శీతల గోదాములు, సూపర్ మార్కెట్లు, కొనుగోలు కేంద్రాలు, రవాణా వ్యవస్థలతో కనీసం కోటి మందికి కొత్తగా ఉపాధి లభిస్తుందని కూడా ఆయన నమ్మబలుకుతున్నాడు. అందుకోసమే ఈ నిర్ణయం తీసుకొన్నామని చెప్తున్నాడు.

అయితే నాణానికి ఒకవైపు మాత్రమే చూస్తున్నారాయన. వాల్‌మార్ట్, టెస్కో వంటి భారీ గొలుసు సూపర్ మార్కెట్ సంస్థలు ప్రపంచం మొత్తం మీద వ్యాపారం చేస్తాయి. ఎక్కడ ఏ వస్తువు చవకగా దొరికితే దాన్ని తెచ్చి అమ్ముతాయి. చైనా వంటి దేశాలలో వస్త్రాలు, ఎలక్ట్రానిక్ వస్తువులు, ఆట బొమ్మలు, స్పోర్ట్స్ పరికరాలు చవక. వియత్నాంలో బియ్యం ధర తక్కువ. థాయిల్యాండ్‌లో చేపలు, రొయ్యలు సలీసుగా దొరుకుతాయి. పాకిస్తాన్ చక్కెరను తక్కువ ధరకే ఇస్తుంది. ఐరోపా దేశాలు సిమెంట్‌ను చవకగా సరఫరా చేస్తాయి. మలేషియాలో పామోలిన్ ధర తక్కువ. బ్రెజిల్‌లో పప్పుదినుసులు తక్కువకే దొరుకుతాయి. ఇటువంటి ధర తక్కువ వస్తువులన్నిటినీ ఈ సూపర్ మార్కెట్లు దిగుమతి చేసుకొంటాయి. దానితో మన దేశంలో ఉత్పత్తి రంగం దారుణంగా దెబ్బతింటుంది. రైతులు, కొన్ని రకాల వ్యవసాయ ఉత్పత్తులలో లాభపడతారు కానీ, పప్పు దినుసుల వంటి వాటిలో చాలా నష్టపోతారు. ఒకపక్క వీధి చివర వుండే కిరాణా కొట్లు మూతపడడం, మరొకప్రక్క ఉత్పత్తి రంగంలో వేలాది పరిశ్రమలు దివాలా తీయడం జరిగిపోతుంది. సూపర్ మార్కెట్ల వల్ల అదనంగా సమకూరే ఉద్యోగాలకు కొన్ని రెట్లు అధికంగా ప్రజలు జీవనోపాధి కోల్పోతారు. ఈ లాభ నష్టాలను పరిగణనలోకి తీసుకోకుండా వారన్ బఫెట్ వంటి అమెరికన్ పెట్టుబడిదారుల మాయా మాటలకు తలవొగ్గి, చిల్లర వర్తకంలోకి విదేశీ పెట్టుబడులను అనుమతిస్తున్నాడు ప్రధాని. ఆర్థిక సంస్కరణల పేరిట కోట్లాది ప్రజల జీవన విధానం మీద, ఉపాధి మీద దెబ్బ కొట్టాలని చూస్తున్నాడు. ఇది చాలా పెద్ద పొరపాటు నిర్ణయం. దీనిపై సమగ్రంగా చర్చ జరిపిన తర్వాతనే ఒక నిర్ణయానికి రావడం ప్రధానిగా ఆయన పాటించవలసిన కనీసపాటి ప్రజాస్వామిక ప్రక్రియ. ఆర్థిక సంస్కరణలంటే కాకులను కొట్టి గద్దలకు వేయడం కాదన్న నిజాన్ని ఆయన గుర్తు పెట్టుకోవాలి.

జమీన్‌రైతు

## జనవాణి

### మంచి పని చేశాడు!

ప్రజలు అవినీతిని, అధిక ధరలను సహించలేకపోతున్నారు. దీనికి ప్రత్యక్ష నిదర్శనమే ఢిల్లీలో సిక్కు యువకుడు హర్విందర్ సింగ్ కేంద్ర వ్యవసాయ మంత్రి శరద్‌పవార్ చెంప చెళ్లుమనిపించడం. ఈ చర్యను దేశంలోని యువత మొత్తం సమర్థిస్తుంది. దేశంలోని రాజకీయ నాయకులు, బ్యూరోక్రాట్లు మద గజాల్లా తయారయ్యారు. వారికి సామాన్య, మధ్యతరగతి ప్రజలు పడే ఇబ్బందులు తెలియరావడం లేదు. ఇష్టమొచ్చినట్లు నిర్ణయాలు తీసుకోవడం, ధరలు పెంచే పాలకులకు హర్విందర్ సింగ్ మంచి గుణపాఠమే చెప్పాడు.

ఎస్.కిరణ్ — నెల్లూరు

### చెప్పిందేమిటి – చేస్తున్నదేమిటి?

అధికారంలో ఉన్నప్పుడు అవినీతి గూర్చి ఏం చేశారని కాంగ్రెస్ పార్టీ అద్వానీని ప్రశ్నించడం ఆ పార్టీ గురివింద వైఖరికి నిదర్శనం. కాంగ్రెస్ ప్రతిపక్షంలో ఉండగా నాటి అధికార ఎన్‌డిఏని విమర్శిస్తూ ఎన్‌డిఏకి పరిపాలన, అంతర్గత సర్దుబాటు చేతకాదంది. తాము అధికారంలోకి వస్తే అంతర్జాతీయంగా క్రూడాయిల్ రేట్లు ఎంత పెరిగినా చమురు ధరల్ని పెంచబోమని, ప్రజలపై వాటి భారం పడనీయబోమని హామీ ఇచ్చారు. తీరా అధికారంలోకి వచ్చాక రేట్లు పెంచేస్తున్నారు. రాక ముందు చెప్పిందేమిటి? వచ్చాక చేస్తున్నదేమిటి?

పి.అరుణకుమారి — నెల్లూరు

### తెలుగుదేశం కుయ్యోమొర్రో!

తెలంగాణలో టిఆర్‌ఎస్ పార్టీకి గట్టిపోటీనిచ్చే తెలుగుదేశం పార్టీ ప్రాబల్యాన్ని తగ్గించేందుకు కె.చంద్రశేఖర్‌రావు తనదైనశైలిలో శక్తియుక్తులు ఒడ్డుతున్నాడు. తెలంగాణలో ప్రస్తుతమున్న వాతావరణంలో కెసిఆర్ ధాటిని తట్టుకోలేక తెలుగుదేశం నాయకులు కుయ్యోమొర్రో అంటున్నారు. ఈ దశలో కెసిఆర్‌కు సమాంతరంగా కొండా లక్ష్మణ్ బాపూజీ ఆంధ్ర, రాయలసీమ నేతలతో ప్రారంభించిన రౌండ్ టేబుల్ సమావేశాలు, దీక్షలకు తెలుగుదేశం పార్టీ మద్దతు ప్రకటించింది. నెల్లూరులో కొండా లక్ష్మణ్ బాపూజీ పెట్టిన రౌండ్ టేబుల్ సమావేశానికి తెలుగుదేశం పార్టీ సహకారమందించింది. ఈ వైఖరిని సమైక్యవాదులంతా ఖండించాలి.

సి.హెచ్.హనుమంతరావు — నెల్లూరు

### అభిమాన దురభిమానం

వెండితెర హీరోల అభిమానులు ఒకరిపై మరొకరు వ్యాఖ్యలు చేసుకోవడం, ఛాలెంజ్‌లకు దిగడం సహేతుకం కాదు. గడచిన దశాబ్దకాలంగా ఈ గొడవలు లేవు. దేశంలో సమస్యలేవీలేనట్లు రామ్‌చరణ్, మహేష్‌బాబు అభిమానులు తమ హీరోల సినిమాలు కలెక్షన్ల సాధనపై పత్రికల్లో ప్రకటనలు, టీవీల్లో దూష

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

5-12-1941
పేజీలు : 10 వెల: అణా

### సత్యాగ్రహము

మేనకూరు వీర్రాఘవరెడ్డిగారు 4తేది విడుదలై 6వతేది మధ్యాహ్నం ఎక్స్‌ప్రెస్‌లో నెల్లూరు వస్తారని తెలుస్తున్నది.

అన్ని ఆంధ్రా జిల్లాల కాంగ్రెసు ఏజంట్లు వెంటనే సత్యాగ్రహం చేయవలసినట్లు ప్రకాశం పంతులు సాదరు చేశారు. కాని నెల్లూరు ఏజంటు వంగల్లు కోదండరామరెడ్డి గారికి హిందూ మహమ్మదీయ కలహాల్లో నష్టపడ్డ బాధితులకు సాయము జేయు రిలీఫ్‌కమిటి బాధ్యత ప్రకాశం పంతులే నెత్తిన వేస్తూ వీరికి మాత్రం ప్రస్తుతం మినహాయింపు ఇచ్చారు.

### మునిసిపల్ మీటింగు

నవంబరు 20తేదిన జరిగిన నెల్లూరు మునిసిపల్ సమావేశంలో 1941–42 బడ్జెటు ప్యాసు చేయించారు. మలేరియా నివారణకు రు.1560, రోడ్లకు రు.2400, కమ్యూనికేషనులకు రు.3000 శాంక్షన్ చేశారు. ఎలిమెంటరీ స్కూళ్ల ఆక్టింగ్ టీచర్ల జీతాలు రు.15నుండి 20కి హెచ్చించారు. ప్రకాశం రిలీఫ్ కమిటీకి రు.500 శాంక్షన్ చేశారు. 11తేదీన స్పెషల్ మీటింగు జరుపుటకు నిర్ణయించారు.

### హైస్కూల్ సెలక్షన్

విఆర్ హైస్కూల్‌లో సెలక్షన్‌కు ఆరు మాసాల పరీక్షలు డిసెంబర్ 4తేది నుండి జరుపుతున్నారు. ఈ సంవత్సరం టీచర్ల మార్పులు, విద్యార్థులకు పాఠాలు జరగకపోవడం, మతకలహాల వల్ల స్కూళ్లు మూతబడడం మున్నగు గొడవలెన్నో వున్నవి. ఏ కారణమైతేనేం విద్యార్థులకు పాఠాలు జరగలేదు. కావున ఈ సంవత్సరం సెలక్షన్స్ తీసివేయడం సబబుగా వుంటుంది.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

1-12-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### రాపూరుకు ఏ.సి – ఆత్మకూరుకు సంజీవరెడ్డి!

ఢిల్లీలో కాంగ్రెస్ కేంద్ర ఎన్నికల సంఘం నెల్లూరుకు జి.సి.కొండయ్యను, గూడూరుకు పాత సభ్యుడు మాదరపాక మునుస్వామిని, కనిగిరికి మౌలా సాహెబును నిర్ణయించింది. రాష్ట్ర ఎన్నికల సంఘం ఈ స్థానాలలో పెనుబోలు సుబ్బయ్యను, పత్రి ఆదిశేషయ్యను, దేవిరెడ్డి లక్ష్మీరెడ్డిని సూచించి వుండినది.

రాపూరుకు ఏ.సి.సుబ్బారెడ్డిని, సర్వేపల్లికి వంగల్లు కోదండరామరెడ్డిని, ఆత్మకూరుకు ఆనం సంజీవరెడ్డి గారల అభ్యర్థిత్వాలను ఖాయం జేసింది. తక్కిన నియోజకవర్గాలలో గుడా రాష్ట్ర సంఘ సూచనలనే ఆమోదించింది.

కొండయ్య నెల్లూరులో పోటీజేయుటకు అంగీకరించడం లేదట. చివరన ఏమి జరుగుతుందో తెలియదు. కొండయ్య తన ప్రయత్నాన్ని మాత్రం వీడలేదని తాజా వార్తల వల్ల తెలుస్తున్నది. అయితే వారికి ఆత్మకూరు ఇవ్వబడదనేది మాత్రం తేలిపోయింది.

మౌలా సాహెబును జిల్లా కాంగ్రెసు సంఘం కనిగిరికి సూచించి వుండినది. రాష్ట్ర కాంగ్రెస్ సంఘం మాత్రం అది మార్చి, దేవిరెడ్డి లక్ష్మీరెడ్డిని నిర్ణయించింది. ఇప్పుడు కేంద్ర ఎన్నికల సంఘం జిల్లాకాంగ్రెస్ సంఘ సూచననే ఖాయపరచింది. కాని మౌలా సాహెబ్ దీనికి మొదట సుముఖుడు కాదు. ఇప్పుడు ఎంత వరకు సిద్ధపడతాడో చూడవలసి వుంది.

అభ్యర్థుల వ్యవహారం పరి సమాప్తమైంది. పాత బేధాలను, పూర్వసంఘటనలను విస్మరించి, కాంగ్రెస్ వాదులందరూ ఏకోన్ముఖంగా ఎన్నికల రంగంలో దిగవలసి వున్నది.

# నెల్లూరు ముచ్చట్లు

## తలవని తలంపుగా వర్షం!

నవంబర్ 26, 27 తేదీల్లో జిల్లా అంతటా తలవని తలంపుగా భారీ వర్షం నమోదయ్యింది. రుతుపవన ప్రభావానికి అల్పపీడనాలు తోడవ్వడంతో గూడూరు డివిజన్‌లో బాగా, నెల్లూరు, కావలి డివిజన్లలో వ్యవసాయ పనులకు ఊతమిచ్చే రీతిలో వర్షం పడింది. డిశంబర్ నెలలో వాయుగుండాలు ఏర్పడకపోతే ఈ సీజన్‌లో ఇదే చివరి వర్షమవుతుంది.

## భూ ప్రకంపనలు

జిల్లాలో ఎప్పుడోగాని భూ ప్రకంపనలు నమోదు కావు. అటువంటిది నవంబర్ 26వ తేది అర్ధరాత్రి దాటాక పొదలకూరు, ఆదూరు, గూడూరు, దాచూరులలో స్వల్ప భూప్రకంపనలు నమోదయ్యాయి. పొదలకూరులో ప్రకంపనల ధాటికి ఇళ్లలోని వస్తువులు చెల్లాచెదురుగా పడిపోయాయి. భూ ప్రకంపనలకు కారణాలను విశ్లేషించే వ్యవస్థ జిల్లాలో లేదు. దీనివల్ల ప్రకంపనలు ఎందుకు సంభవించాయో తెలియరావడం లేదు.

## రొట్టెల పండుగ

హిందూ – ముస్లింల మధ్య మత సమైక్యతకు ప్రతీకగా నిలచే రొట్టెల పండుగ నెల్లూరు చెరువు గట్టున గల బారాషహీద్ దర్గా వద్ద డిశంబర్ 7, 8, 9 తేదీల్లో జరుగుతుంది. మొహరం పండుగ జరిగిన మరుసటిరోజు జరిగే ఈ పండుగ గత ఐదారేళ్లుగా మూడు రోజులకు విస్తరించింది. ఐదు లక్షల మంది భక్తులు హాజరయ్యే ఈ పండుగకు చేయాల్సిన ఏర్పాట్లపై నెల్లూరు రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి 28వ తేది దర్గా వద్ద అన్ని శాఖల అధికారులతో సమీక్షా సమావేశం నిర్వహించారు.

## ఆక్రమణల వల్లే వరద

నెల్లూరు నగరంలో వెలసిన అక్రమ లేఅవుట్లు, ఇష్టారాజ్యంగా కట్టిన ఇళ్లు, కాలువల ఆక్రమణల వల్ల వర్షం పడినప్పుడు వరద ముప్పు తప్పడం లేదని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి చెప్పారు. 28వ తేది తన అగ్రజుడు వివేకానందరెడ్డితో కలసి ఆత్మకూరు బస్టాండ్, రామలింగాపురం, మాగుంట లేఅవుట్ అండర్ బ్రిడ్జి ప్రాంతాలను పరిశీలించారు. కార్పొరేషన్ అధికారులు ఇప్పటికైనా మేలుకొని పట్టణ అభివృద్ధి ప్రణాళికను రూపొందించుకోవాలని సూచించారు. నేతలు అడ్డు పడకుంటే నెల్లూరు నగరంలో ఆక్రమణల తొలగింపు ఎంత సేపు?

## మేకపాటి రాజీనామా తిరస్కరణ!

ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి చేసిన రాజీనామాను అసెంబ్లీ స్పీకర్ నాదెండ్ల మనోహర్ 28వ తేది తిరస్కరించారు. గత మూడు నెలలుగా ఈ రాజీనామాపై ప్రతిష్టంభన నెలకొనింది. ఎవరు ఏ నిర్ణయం తీసుకొన్నా తాను మాత్రం వైఎస్ జగన్ పక్షాన ఉన్నట్లు చంద్రశేఖర్‌రెడ్డి ఉదయగిరిలో ప్రకటించారు.

## పెద్దలను కలసిన ప్రసన్న

కోవూరు అసెంబ్లీ ఉప ఎన్నికల్లో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ తరపున పోటీ చేస్తున్న నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి పారిశ్రామికవేత్తలు పి.వి.ప్రసన్నరెడ్డి, వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డిలను 28వ తేది నెల్లూరులోని వారి నివాసాల్లో కలసి మద్దతు అభ్యర్థించారు. పి.వి.ప్రసన్నరెడ్డి కోవూరు నియోజకవర్గ వాసి. ప్రభాకర్‌రెడ్డి అల్లూరు మండలం ఇందుపూరు గ్రామవాసి. ఈ ఇద్దరు పెద్దలను వేరు కారణాల నిమిత్తం ప్రసన్న కలసినట్లున్నాడు.

## వివేకాకు ఏం తెలుసు?

తనను నోటికొచ్చినట్లు తిట్టిన రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డిని అదే స్థాయిలో తిట్టిపోశాడు కోవూరు మాజీ ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి. కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి చేస్తున్న పాదయాత్ర కార్యక్రమంలో నెల్లూరు డైకస్‌రోడ్డు సెంటర్‌లో పాల్గొని మద్దతు తెలిపిన ప్రసన్న మాట్లాడుతూ వివేకా వివిధ షోరూంల ప్రారంభోత్సవాలకు వెళ్లి చీరలు కట్టుకోవడం, చెవిపోగులు పెట్టుకోవడం మినహా ప్రజా సమస్యలు పట్టవన్నారు. ఆయన ఆనం కుటుంబంలో చెడబుట్టాడని తీవ్ర విమర్శ చేశారు.

## రంగరాజన్‌కు కిసాన్ కేత్ బాధ్యతలు

నెల్లూరు అయ్యప్ప దేవస్థానం పాలకవర్గం అధ్యక్షుడు, పెట్రోల్ బంకుల యజమాని పిటి రంగరాజన్ "ఆలిండియా కిసాన్ కేత్ మజ్దూర్ కాంగ్రెస్" రాష్ట్ర ఉపాధ్యక్షునిగా నియమితులయ్యారు. ఈ పత్రాన్ని బారాషహీద్ దర్గా దగ్గర రంగరాజన్‌కు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి అందించడం విశేషం. రంగరాజన్‌కు వ్యవసాయ బాధ్యతల కన్నా వాణిజ్య మండలి బాధ్యతలు అప్పగిస్తే బాగుండేది.

## ఇబ్బందిపడుతున్న కాకాణి

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ కన్వీనర్ నిర్వహణ బాధ్యతలను కాకాణి గోవర్ధన్‌రెడ్డి జడ్పీ ఛైర్మన్ అంత సుకరంగా నిర్వహించలేకపోతున్నారు. ఆయన పార్టీలోని అన్ని వర్గాలను సంతృప్తి పరచలేకపోతున్నట్లు ఆ పార్టీ వర్గాలే వ్యాఖ్యానిస్తున్నాయి.

## వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి దాతృత్వం!

వదాన్యుడు, పారిశ్రామికవేత్త వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి దాతృత్వంతో నెల్లూరు డికెడబ్ల్యు కాలేజీలో కొత్తగా నిర్మించిన భోజనశాలను 28వ తేది ప్రారంభించారు. క్యాంటిన్ కమ్ భోజనశాలగా ఉపయోగపడేట్లు దీన్ని నిర్మించారు. 12 లక్షల రూపాయలకు పైగా దీనికోసం వెచ్చించారు. ప్రారంభోత్సవానంతరం ప్రభాకర్‌రెడ్డి మాట్లాడుతూ నగరంలోని ఏకైక మహిళా డిగ్రీ కళాశాల అయిన డికెను ఇంకా ఎంతో తీర్చిదిద్దవలసి ఉందన్నారు. కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ ఎ.శారదా దేవి మాట్లాడుతూ కళాశాల అభివృద్ధి కమిటీ సభ్యుడైన వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి దాతృత్వంతో విద్యార్థినులకు గతంలో యూనిఫాంలు, క్రీడా పరికరాలు అందాయని, ఇప్పుడు ఎంతో విలువైన భోజనశాల సమకూరిందన్నారు. ఈ కార్యక్రమంలో కాలేజీ పిల్లలు, ఉపాధ్యాయులతోపాటు పట్టణ ప్రముఖులు గ్రోసు గోపాలయ్య, వీరిశెట్టి హజరత్‌బాబు, వెందోటి సాయిభాస్కర్‌రెడ్డి, పోలీసు అధికారుల సంఘం నాయకుడు శ్రీహరి తదితరులు పాల్గొన్నారు.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు పేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, వి.ఆర్.కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

జీవిత చందా రూ.1000/-

సంవత్సర చందా
స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## బయటపడుతూనే ఉన్న మనీ

సిబిసిఐడి విభాగం మనీ సర్క్యులేషన్ స్కీం పుట్టలను పగులకొట్టే కొద్దీ ప్రజల నుంచి దోచుకొన్న డబ్బు బయట పడుతూనే ఉంది. న్యూవిజన్ ఫౌండేషన్‌కు సంబంధించి ప్రధాన ఏజెంట్ నెహేమియా తిరుపతికి చెందిన సుందరం, వినోద్ నెల్లూరుకు చెందిన దీపక్, రవి, విజయల దగ్గర దాచిన 55 లక్షల రూపాయల నగదు, టాటా సఫారీ, ఇండికా కారును సిబిసిఐడి పోలీసులు స్వాధీనం చేసుకొన్నారు. బొడ్డువారిపాళెంలో ట్రోగో వాన్ ఫార్మర్ సొసైటీ ఏజెంట్ శ్యామ్ కొనుగోలు చేసిన 20 ఎకరాల భూమిని తమ ఆధీనంలోనికి తీసుకొన్నారు. ఈ తంతు చూస్తుంటే మనీ సర్క్యులేషన్ స్కీంలో ఏజెంట్ల వద్దే ఇంకా జనం సొమ్ము దొబూచులాడుతుంది.

## వైద్య కేంద్రాల్లో స్కానింగ్ మిషన్లు

జిల్లాలోని పలు కమ్యూనిటీ హెల్త్ సెంటర్‌లలో అల్ట్రాసౌండ్ స్కానింగ్ మిషన్లు ఏర్పాటు కానున్నాయి. ఆత్మకూరు, కావలి, ఉదయగిరి, సూళ్లూరుపేట, నాయుడుపేట, వెంకటగిరి, గూడూరు తదితర వైద్య కేంద్రాలలో ఈ స్కానింగ్ మిషన్లను త్వరలో ఏర్పాటు చేస్తున్నట్లు డిఎం అండ్ హెచ్‌ఓ డాక్టర్ మాశిలామణి తెలిపారు. అలాగే పలు వ్యాధులకు సంబంధించి ప్రత్యేక కేంద్రాలను, సిబ్బందిని నియమిస్తున్నట్లు తెలిపారు. ఎన్ని చేసినా వైద్య సిబ్బందిలో మార్పు తేవడం అంత సులభమైన పని కాదని ఈపాటికే అర్థమై ఉంటుంది ఆయనకు.

## సహకార శాఖలో డ్రస్‌కోడ్

సహకార శాఖ సిబ్బందికి ఇక డ్రస్‌కోడ్ వర్తించనుంది. ఈ విషయాన్ని జిల్లా పర్యటనకు వచ్చిన ఆ శాఖ మంత్రి కాసు కృష్ణారెడ్డి తెలియజేశారు. మహిళా ఉద్యోగినులకు ఆకుపచ్చ చీర, పురుషులకు పచ్చరంగు చొక్కా, ఫ్యాంటును డ్రస్

కొరవ 14వ పేజీలో



**ఉత్తరక్రియలు**

మా యింటిదైవం, మాతండ్రిగారు
**శ్రీ తుమ్మల మస్తానయ్యగారు**
(ప్రొ॥ హోటల్ వెంకటరమణ, స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు)
తేది 25-11-2011 శుక్రవారం నాడు స్వర్గస్తులైనారు.
**పెద్దకర్మ** తేది 7-12-2011
బుధవారం ఉదయం నెల్లూరు, స్టోన్‌హౌస్‌పేట, (పప్పులవీధి) కంసాలివీధి, ఇం.నెం. 5-1-180 లోని మా స్వగృహమునందు జరుగును. కావున తెలియజేయడమైనది.
ఇట్లు... కుమారుడు
**తుమ్మల నాగరాజ కుమార్** మరియు కుటుంబ సభ్యులు. సెల్: 9052067785.

జననం: 1-7-1950 మరణం: 25-11-2011
శ్రీ తుమ్మల మస్తానయ్యగారు
(ప్రొ॥ హోటల్ వెంకటరమణ, స్టోన్‌హౌస్‌పేట)

● వర్షంతో

# స్తంభించిన జనజీవనం!



గాంధీబొమ్మ వద్ద సెలయేరును తలపిస్తున్న ట్రంకురోడ్డు.

బంగాళాఖాతంలో ఏర్పడిన అల్పపీడన ద్రోణి ప్రభావంతో జిల్లాలో పలు ప్రాంతాల్లో విస్తారంగా వర్షాలు పడ్డాయి. ఎడతెరిపి లేకుండా కురిసిన వర్షానికి నగరంలో జనజీవనం పూర్తిగా స్తంభించింది. ఎక్కడికక్కడ రోడ్లపై నీరు నిలచి పోవడంతో అసలే గుంటలు మిట్టలుగా ఉన్న రోడ్లు నీటితో నిండి మరింత అస్తవ్యస్తంగా తయారు కావడంతో రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడింది. ఎప్పటిలాగే ఆత్మకూరు బస్టాండు అండర్ బ్రిడ్జి వద్ద, విజయమహల్ బాక్స్ టైప్ బ్రిడ్జి, రామలింగాపురం బ్రిడ్జి, మాగుంట అండర్ బ్రిడ్జిల్లోకి పైదాకా నీరు చేరడంతో రాకపోకలు నిలచిపోయాయి. పలు వాహనాలు బ్రిడ్జిల వద్ద నీళ్లలో చిక్కుకుపోయాయి. నిప్పో సెంటర్, సింధూర నర్సింగ్‌హోమ్, బొల్లినేని హాస్పిటల్, గాంధీబొమ్మ వద్ద రోడ్లపై నీళ్లు నిలబడిపోయాయి. కుండపోతగా పడిన వర్షం కారణంగా ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడ్డారు. ఇంట్లో నుంచి కాలు బయటపెట్టే పరిస్థితి లేకపోవడంతో రోడ్లన్నీ నిర్మానుష్యంగా మారాయి. శివారు ప్రాంతాల్లో ప్రజలు మరింతగా ఇబ్బందులు ఎదుర్కొన్నారు. సుందరయ్యకాలనీ, పడారుపల్లి, డ్రైవర్స్‌కాలనీ, అనగుంట, జనశక్తి నగర్, బుజబుజ నెల్లూరు, వెంగళరావునగర్, బాబు జగజ్జీవన్‌రామ్ కాలనీ తదితర ప్రాంతాలు పూర్తిగా వర్షపు నీటితో నిండిపోయాయి. పలు ప్రాంతాల్లో ఇళ్లలోకి నీరు రావడంతో ఆ కుటుంబాల కష్టాలు అన్నీ ఇన్నీ కావు. మొత్తం మీద ఎవరూ ఊహించని విధంగా హఠాత్తుగా కురిసిన వర్షం జనజీవనాన్ని చిందరవందర చేసింది.

# అటకెక్కిన జలమణి పథకం

● మూణ్నాళ్ల ముచ్చటేనా?

విద్యార్థులకు మంచినీటిని అందించేందుకు ఏర్పాటుచేసిన జలమణి పథకం మూణ్నాళ్ల ముచ్చటగా మిగిలింది. అధికారుల పర్యవేక్షణా లోపం, కంపెనీలు పత్తాలేకపోవడంతో జిల్లావ్యాప్తంగా విద్యార్థుల దాహార్తిని తీర్చేందుకు ఏర్పాటైన పథకం అటకెక్కింది. ఫలితంగా పిల్లలు గుక్కెడు నీటి కోసం అల్లాడుతున్నారు. ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థులకు సురక్షిత మంచి నీటిని అందించాలన్న ఉద్దేశంతో ప్రభుత్వం జలమణి పథకాన్ని 2008 – 09 సంవత్సరంలో ప్రారంభించింది. జిల్లావ్యాప్తంగా 157 పాఠశాలలను ఈ పథకం క్రింద ఎంపిక చేశారు. ఒక్కో పాఠశాలకు జలమణి యూనిట్‌ను ఏర్పాటు చేసుకొనేందుకు 20వేల రూపాయల లెక్కన మొత్తం 31.40 లక్షల రూపాయల నిధులను మంజూరు చేశారు. ఇందులో పదివేలు ప్లాంటు ఏర్పాటుకు, మరో పదివేలు ఐదేళ్లపాటు నిర్వహణకు చెల్లించేలా ఒప్పందం చేసుకొన్నారు. పథకం కాంట్రాక్టును హైదరాబాద్‌కు చెందిన దక్షన్ పవర్ ప్రాజెక్ట్ లిమిటెడ్ అనే కంపెనీ చేపట్టింది. యూనిట్ ఏర్పాటుకయ్యే మొత్తం వ్యయంలో 25 శాతాన్ని ముందుగా చెల్లించి మిగతా మొత్తాన్ని ఐదేళ్లపాటు ప్రతి ఏడాది పది శాతం వంతున చెల్లించేలా ఆర్‌డబ్ల్యుఎస్ అధికారులు అంగీకారం కుదుర్చుకొన్నారు. కాంట్రాక్టు పొందిన కంపెనీ నిర్లక్ష్యంగా వ్యవహరించడంతో మొదటగా ఏర్పాటుచేసిన 100 పాఠశాలల్లో జలమణి పథకం మూలన పడింది. ఇవి సక్రమంగా పనిచేయకపోవడం, అధికారులు పట్టించుకోకపోవడంతో జలమణి పథకం కాస్త అటకెక్కింది. పలు పాఠశాలల్లో ఈ పథకం క్రింద ఏర్పాటుచేసిన యూనిట్లు దుమ్ముకొట్టుకపోతున్నాయి. కాంట్రాక్టర్, ఆర్‌డబ్ల్యుఎస్ అధికారుల నిర్వాకంతో విద్యార్థులకు మంచి నీటిని అందించాలన్న ప్రభుత్వ లక్ష్యం నీరుగారి పోయింది.

# ప్రభుత్వంపై మంత్రి విమర్శలు!

● డాక్టర్ శంకర్రావ్ తీరేవేరు

రాష్ట్ర చేనేత, జౌళి శాఖా మంత్రి డాక్టర్ శంకరరావు ఏది చేసినా, ఏమి మాట్లాడినా అది సంచలనమే అవుతుంది. ఆయన వ్యవహారశైలే అందుకు కారణం. అలాంటి మంత్రి రాష్ట్ర ప్రభుత్వ తీరుపై తనదైనశైలిలో విమర్శలు గుప్పించడం అందరినీ ఆశ్చర్య పరిచింది. ఇటీవల జిల్లా పర్యటనకు వచ్చిన ఆయన నగరంలో గోల్డెన్ జూబ్లీ హాల్‌లో చేనేత జౌళి శాఖాధికారులతో సమీక్ష సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా విలేకరులతో మాట్లాడుతూ రాష్ట్రంలో వ్యాట్ అధికంగా ఉందని వ్యాఖ్యానించారు. మిగతా రాష్ట్రాల్లో 4 శాతం వుంటే మన రాష్ట్రంలో అధికంగా 14.5 శాతం ఉందని, దానివల్లనే రాష్ట్రంలో పరిశ్రమలు రాలేకపోతున్నాయంటూ వ్యాఖ్యానించడంతో



సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న మంత్రి శంకరరావు.

విన్నవాళ్లు ఇదేమిటి రాష్ట్ర ప్రభుత్వంలో మంత్రి అయి ఉండి ఇలాంటి విమర్శలు చేస్తున్నాడని ఆశ్చర్యపోయారు. మంత్రిని కలిసి తమ డిమాండ్లు పరిష్కరించుకొనేందుకు వచ్చిన నేత కార్మికులకు అదే స్థాయిలో షాక్ ఇచ్చాడు మంత్రి. జిల్లాలో నేత బజార్ ఏర్పాటు చేస్తామన్నారు ఇంతవరకు అది ఏర్పాటు కాలేదంటూ విన్నవించిన చేనేత కార్మికులపై మంత్రి ఆగ్రహించారు. అవన్నీ నాకు తెలియదు, నేనెప్పుడైనా చెప్పానా అంటూ ఎదురు ప్రశ్నించడంతో ఆశ్చర్యపోవడం వారి వంతైంది. నేత కార్మికులు పాత పద్ధతులకు స్వస్తి చెప్పి కొత్త విధానాలు అవలంబించాలని అనడంతో ఆయన ఏమి మాట్లాడుతున్నాడో చేనేతలకు అర్థం కాలేదు. పనిలో పనిగా చంద్రబాబుపై సిబిఐ విచారణను ప్రస్తావిస్తూ మంత్రి ఆయన సుప్రీంకోర్టుకు వెళ్లడాన్ని స్వాగతిస్తున్నామన్నారు. రాష్ట్రంలో అవినీతిలేని పాలన రావాలని అదే తన కోరిక అని ముక్తాయించడంతో అక్కడున్నవారంతా అవాక్కయ్యారు.

# ఉత్తుత్తి సర్వే!

జిల్లాలో ఎంత మంది గిరిజనులు ఉన్నారన్న దానిపై రెండు సంవత్సరాల క్రితం "రైజ్" అనే సంస్థ ద్వారా సర్వే జరిపారు. నెల్లూరుజిల్లాతోపాటు ప్రకాశం, చిత్తూరు జిల్లాల్లో కూడా గిరిజన జనాభాపై ఇదే సంస్థ సర్వే చేపట్టింది. ఈ సంస్థ నిర్వహించిన సర్వే ఆధారంగా గిరిజనులను గుర్తించి అందుకు అనుగుణంగా వివిధ సంక్షేమ అభివృద్ధి పథకాలను అమలు చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. తిరుపతి కేంద్రంగా ఉన్న ఈ సంస్థ జరిపిన సర్వే సక్రమంగా లేదని అధికారులే చెబుతున్నారు. గ్రామీణ ప్రాంతాలు, కాల్వగట్లు, చెరువులు, అడవుల సమీపంలో గిరిజనులు తాత్కాలికంగా నివాసాలు ఏర్పాటుచేసుకొని జీవనం సాగిస్తుంటారు. సంస్థ ప్రతినిధులు సమగ్ర సర్వే చేయకుండా గ్రామానికి వెళ్లి సర్పంచ్, లేకుంటే వార్డు మెంబర్‌ను సంప్రదించి వారు చెప్పిన వివరాలను నమోదు చేసుకున్నారు. వాస్తవంగా ఎంత మంది గిరిజనులున్నారు? వీరి ఆర్థిక పరిస్థితి ఏమిటి అన్న వివరాలు సేకరించడంలో విఫలం చెందారు. మూడు జిల్లాల్లో సర్వే నిర్వహించినందుకు దాదాపు 25 లక్షలు ప్రభుత్వం చెల్లించింది. అధికారులు కొన్ని ప్రాంతాల్లో సర్వే విధానం తనిఖీలు చేయగా పలు లోపాలు బయట పడడం విశేషం.

**గిరిజనుల గుర్తింపు కలే!**



సుబ్బరామరెడ్డి విగ్రహావిష్కరణలో జంట ఎమ్మెల్యేలతో పార్వతమ్మ.

# మాగుంట సేవలు శ్లాఘనీయం!

మాజీ పార్లమెంటు సభ్యుడు దివంగత మాగుంట సుబ్బరామిరెడ్డి నూతన విగ్రహ ప్రతిష్ఠాపన కార్యక్రమం నవంబర్ 26వ తేదీ అట్టహాసంగా జరిగింది. సుబ్బరామిరెడ్డి 64వ జన్మదినాన్ని పురస్కరించుకొని మాగుంట సర్కిల్ పేరుతో ఉన్న ప్రాంతంలో పాత విగ్రహాన్ని తొలగించి ఆ స్థానంలో నూతనంగా తయారుచేయించిన విగ్రహాన్ని పునః ప్రతిష్ఠించారు. ఈ కార్యక్రమానికి రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి, నగర శాసనసభ్యుడు ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి తదితరులు పాల్గొని మాగుంట చేసిన సేవలను కొనియాడారు. పేద ప్రజల అభ్యున్నతికి సుబ్బరామిరెడ్డి విశేష కృషి చేశారన్నారు. నెల్లూరు, ఒంగోలు జిల్లాలలో ప్రజల దాహార్తిని తీర్చేందుకు ఎన్నో కార్యక్రమాలు చేపట్టి ప్రజల హృదయాల్లో శాశ్వత స్థానం సంపాదించారన్నారు. సుబ్బరామిరెడ్డి సతీమణి, మాజీ శాసనసభ్యురాలు మాగుంట పార్వతమ్మ మాట్లాడుతూ మాగుంట ఒక వ్యక్తిగా కాక శక్తిగా ఎదిగి ప్రజలకు సేవచేసేందుకు విశేషంగా కృషి చేశారని గుర్తు చేసుకొన్నారు. నూతన విగ్రహాన్ని తయారుచేసిన విఖ్యాత శిల్పి వడయార్‌ను ఈ సందర్భంగా సన్మానించారు. ఈ కార్యక్రమంలో మాగుంట సుబ్బరామిరెడ్డి కుమారుడు విజయబాబు తదితరులు పాల్గొన్నారు.



విలేకరులతో మాట్లాడుతున్న సిపిఐ రాష్ట్ర కార్యదర్శి నారాయణ.

# మంత్రులను విచారించాలి

గనుల కుంభకోణంలో చిక్కుకొన్న ఐఎఎస్ అధికారులతోపాటు దీనిలో భాగస్వామ్యం ఉన్న మంత్రులపైనా చర్యలు చేపట్టాలని సిపిఐ కార్యదర్శి నారాయణ డిమాండ్ చేశారు. నగరానికొచ్చిన ఆయన సిపిఐ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. ఈ వ్యవహారంలో పలువురు మంత్రులకు సంబంధాలున్నందున వారిని విచారించాలన్నారు. రాష్ట్రంలో పాలన కుంటుపడిందని ప్రజలు పెరిగిన ధరలతో అల్లాడుతున్నారన్నారు. ఇవేమీ పాలకులకు పట్టడం లేదని, ఎమ్మెల్యేలు ఎవరితో వున్నారనే దానిపై దృష్టి సారించారు తప్ప ప్రజల బాగోగులు పట్టవన్నారు. దీనివల్ల ఎమ్మెల్యేలు భయాందోళనలు వ్యక్తం చేస్తున్నారన్నారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి 15 లక్షల ఉద్యోగాలిస్తానంటున్నారని, కానీ గత కొన్నేళ్లుగా మూడు లక్షల ఉద్యోగాలు భర్తీ కాకుండా వున్నాయని వాటిని ముందుగా భర్తీ చేయకుండా ఇలాంటి హామీలివ్వడం సిగ్గు చేటన్నారు. అవినీతికి పాల్పడిన అధికారుల నుంచి అక్రమంగా సంపాదించిన సొమ్మును వెలికితీయాలని డిమాండ్ చేశారు. విదేశీ సంస్థలు రిటైల్ వ్యాపారాలలోకి అడుగు పెట్టడంతో చిరు వ్యాపారులు ఆర్థికంగా కోలుకోలేకుండా పోతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు.

● పోలీసులకు సవాల్‌గా మారుతున్న

# హత్యలు, దొంగతనాలు!

**నెల్లూరు నగరంలో దొంగతనాలు పెచ్చుపెరిగిపోయాయి. ఒక పథకం ప్రకారం మహిళల హత్యలు జరుగుతున్నా నిందితులను పట్టుకోవడంలో నగర పోలీసులు పూర్తిగా విఫలమయ్యారు.**



మినీ బైపాస్ రోడ్డులో హత్యకు గురైన రమాదేవి శవాన్ని పరిశీలిస్తున్న ఎఎస్పీ, పట్టణ సిఐ.

నెల్లూరు నగరంలో రోజురోజుకు నేరాలు పెరిగిపోతున్నాయి. ద్విచక్రవాహనాల దగ్గర నుంచి మహిళల మెడలో బంగారు సరుడుల వరకు అపహరించుకుపోతున్నారు. పోలీసుశాఖ నేరాల నియంత్రణకు గట్టి నిఘా ఏర్పాటు చేస్తున్నట్లు ప్రకటిస్తున్నా అవి అమలుకు నోచుకోవడం లేదు. ప్రతిరోజు ఏదో ఒక పోలీసుస్టేషన్ పరిధిలో నేరాలు జరుగుతూనే వున్నాయి. నగరంలో ఒంటరిగా వెళ్తున్న మహిళలను లక్ష్యంగా చేసుకొని అఘాయిత్యాలు, గొలుసుల అపహరణకు పాల్పడుతున్నారు. ఇటీవల కొంత కాలంగా మొఖానికి ముసుగులు ధరించి ద్విచక్రవాహనాలపై తిరిగే వారి సంఖ్య అధికంగా కనిపిస్తుంది.

ఎండతీవ్రతకు శరీరం దెబ్బతినకుండా ముఖానికి ముసుగులు ధరిస్తున్నారా? లేక దొంగతనం చేసే సమయంలో ఎవరు గుర్తుపట్టకుండా జాగ్రత్త పడ్డున్నారా అన్న విషయం తెలియడం లేదు. ఏదిఏమైనా ముసుగులు ధరించిన వ్యక్తులే చోరీలు చేస్తున్నారన్నది వాస్తవం. గత సంవత్సర వ్యవధిలో నెల్లూరు నగరంలో ముగ్గురు మహిళలు దారుణహత్యకు గురయ్యారు. వివిధ పనుల నిమిత్తం నగరానికి వచ్చి తిరిగి ఇంటికెళ్లే సమయంలో ముగ్గురు మహిళలు హత్య చేయబడడంతో నగర ప్రజలు భయాందోళన చెందుతున్నారు. ఒంటరిగా నగరానికి వస్తున్న మహిళలను లక్ష్యంగా చేసుకొని బంగారు ఆభరణాల కోసం హత్య చేస్తున్నారా? ఇతర కారణాలు ఏమైనా వున్నాయన్న విషయం బహిర్గతం కావడం లేదు.

పోలీసులు కేసు నమోదు చేస్తున్నారే తప్ప హత్యకు గల కారణాలు తెలుసుకునేందుకు లోతు దర్యాప్తు చేయడం లేదన్న విమర్శలు వున్నాయి. గత సంవత్సరం నగరానికి చెందిన అనురాధ అనే యువతి శివారు ప్రాంతంలోని సుందరయ్య కాలనీ సమీపంలో హత్యకు గురైంది. ఈమె తర్వాత అరుణ అనే మహిళా ఇదే విధంగా హత్య చేయబడింది. గత వారంలో గూడూరు గిరిజన సంక్షేమశాఖలో జూనియర్ అసిస్టెంటుగా పనిచేస్తున్న రమాదేవి అనే మహిళ తెలుగుదేశం పార్టీ జిల్లా కార్యాలయం సమీపంలో హత్యకు గురికాబడింది. గత సంవత్సరం జరిగిన రెండు హత్యలను ఇప్పటివరకు చేధించలేక పోయారు పోలీసులు. రమాదేవి హత్యకు గల కారణాలు ఎప్పటికి వెలుగు చూస్తాయోనన్న చర్చ జరుగుతుంది.

నేర నియంత్రణకు నగరంలో అన్ని పోలీసుస్టేషన్ల పరిధిలో గస్తీ నిర్వహించాల్సిన పోలీసులు బార్లు, హోటళ్ల వద్దనే దర్శనమిస్తుంటారు. రాత్రి సమయంలో నిఘా వుంచినట్లైతే రమాదేవి హత్య జరిగి ఉండేది కాదన్న అభిప్రాయం వినిపిస్తుంది. మహిళల హత్యలు, చోరీలు పోలీసులకు సవాల్‌గా మారుతున్నా హత్యలకు పాల్పడుతున్న వారిని గుర్తించడంలో పోలీసులు వైఫల్యం చెందుతున్నారు. రాత్రి ఏడుగంటల తర్వాత ఒంటరిగా మహిళలు నడిచివెళ్లాలంటే భయపడాల్సిన పరిస్థితి నెలకొంది. ప్రభుత్వ కార్యాలయాల్లో పనిచేసే మహిళలు రాత్రి ఏడుగంటల వరకు కొన్ని సందర్భాల్లో విధులు నిర్వహించి ఇంటికెళ్తుంటారు. అలాగే వివిధ ప్రైవేటు సంస్థల్లో పనిచేసే మహిళలు 9గంటల వరకు వుండాల్సి వుంటుంది.

విధులు ముగించుకుని రాత్రి సమయంలో ఇంటికి వెళ్లేందుకు ప్రస్తుత సంఘటనల నేపథ్యంలో ఒంటరిగా వెళ్లను భయపడుతున్నారు. ఇంటి నుంచి బయటకొచ్చిన మహిళలు తిరిగి ఇంటికి చేరే వరకు కుటుంబ సభ్యులు ఆందోళన చెందుతున్నారు. మహిళలపై జరుగుతున్న అఘాయిత్యాలపై మహిళాసంఘాలు పెద్దగా స్పందించలేక పోతున్నాయి. పోలీసు అధికారులు ఇప్పటికైనా స్పందించి రాత్రి పూట గస్తీ ముమ్మరం చేసి నేరాల నియంత్రణకు చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.

● నిస్తేజంగా

# కాలుష్య నియంత్రణ మండలి!

**కాలుష్యం పెరిగి ప్రజలు పలు రకాలుగా ఇబ్బందులు పడుతున్నా కాలుష్య నియంత్రణ మండలి అధికారులు ఏమాత్రం పట్టించుకోవడం లేదు. కాలుష్యాన్ని వెదజల్లుతున్న సంస్థల నుంచి తృణమో, ఫణమో తీసుకొని ఊరుకొంటున్నారు.**




నెల్లూరులోని కాలుష్య నియంత్రణ మండలి ప్రాంతీయ కార్యాలయం.

జిల్లాలో కాలుష్యం పెరిగి ప్రజలు పలు రకాలుగా ఇబ్బంది పడుతున్నా సంబంధిత శాఖ అధికారులు ఏ మాత్రం పట్టించుకోవడం లేదు. కాలుష్య నియంత్రణ కోసం కాలుష్య నియంత్రణ మండలి విభాగాన్ని ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఈ విభాగం అధికారులపై జిల్లాలో కాలుష్యం వెదజల్లే పరిశ్రమల వివరాలను సేకరించి నియంత్రణ కోసం చర్యలు చేపట్టాల్సిన బాధ్యత వుంది. అయితే ఈ విభాగం అధికారులు కార్యాలయం దాటి కాలుష్యం వెదజల్లే పరిశ్రమల వైపు కన్నెత్తి కూడా చూడడం లేదు. కాలుష్యం కారణంగా ప్రజల ఆరోగ్యం దెబ్బతింటున్నా మాకేమీ సంబంధం లేదన్న విధంగా వ్యవహరిస్తున్నారు.

జిల్లాలో ఇటుక బట్టీలు, రైస్ మిల్లులు, హోటళ్ల నుంచి కాలుష్యం వెలువడుతోంది. వీటిని ఏర్పాటు చేసిన సమీప గ్రామాల ప్రజలు అభ్యంతరం వ్యక్తం చేస్తున్నా వినేవారు లేకుండా పోయారు. నెల్లూరు నగర సమీపంలో వున్న సౌత్‌రాజుపాళెంలో అధికంగా రైసు మిల్లులు ఏర్పాటు కాబడి వున్నాయి. ఈ మిల్లుల్లో ప్రతి రోజు టన్నుల కొద్దీ ధాన్యం ఆడిస్తుంటారు. దీంతో దుమ్ము, ధూళి, పొట్టు గాలిలో కలుషితమై సమీప నివాసాల్లోకి చేరుతుంది. నీరు సైతం కలుషితం కావడంతో వాటిని వాడుకొనేందుకు అవకాశం లేకుండా పోతోందని ప్రజలు వాపోతున్నారు. అంతేకాకుండా బాయిలర్ నుంచి విడుదల చేసే నీటిని సమీప కాలువల్లోకి వదులుతున్నారు. ఈ నీటి వల్ల భరించరాని దుర్వాసన వస్తుంటుంది. గ్రామంలోకి వెళ్లాలంటేనే దాదాపు రెండు కిలోమీటర్లు ముక్కు మూసుకోక తప్పదు. కాలుష్య నియంత్రణ మండలి అధికారులు ఈ విషయమై ఎటువంటి చర్యలు తీసుకునేందుకు ముందుకు రావడం లేదు. రహదారుల వెంబడి ఇటుక బట్టీలు ఏర్పాటు చేయడం వల్ల దారిన వెళ్లే వారితోపాటు వాహనదారులు సైతం ఇబ్బంది పడుతున్నారు. ఇటుకలను కాల్చేందుకు పొట్టును వినియోగిస్తుంటారు. పొట్టును కాల్చిన అనంతరం తెల్లటి పొడి వెలువడుతుంది. ఈ పొడి గాలిలో కలిసిపోయి ద్విచక్ర వాహనాలపై వెళ్లే వారి కళ్లలో పడుతుంది. కళ్లలో పడిన పొడిని బయటకు తీసేందుకు వైద్యశాలకు వెళ్లక తప్పడం లేదు.

## ప్రజాభిప్రాయ సేకరణకే పరిమితం!

కాలుష్య నియంత్రణ మండలి విభాగం అధికారులు జిల్లాలో భారీ పరిశ్రమల ఏర్పాటుకు అనుకూలంగా వ్యవహరిస్తున్నారన్న ఆరోపణలున్నాయి. వివిధ ప్రాంతాల్లో పరిశ్రమ ఏర్పాటుకు సంబంధించి ప్రజాభిప్రాయ సేకరణ చేసేందుకే వారు పరిమితమైపోయారు. ప్రజాభిప్రాయ సేకరణ పేరుతో సమీప గ్రామాల ప్రజలను ఏదో ఒక విధంగా ప్రలోభాలకు గురి చేసి అనుకూలంగా వ్యవహరించేటట్లుగా ప్రయత్నం చేస్తుంటారు. ఇతర పరిశ్రమల నుంచి ఏ మేరకు కాలుష్యం వస్తుంది? ఇందుకు నిర్వాహకులు తీసుకొంటున్న చర్యలు ఏమిటి? అన్న దానిపై పర్యవేక్షణ చేయడం లేదు. కాలుష్యం వెలువడే పరిశ్రమలు, రైసు మిల్లులపై ఫిర్యాదులు అందుతున్నా బుట్టదాఖలు చేస్తున్నారు. ఇప్పటికైనా జిల్లా కలెక్టర్ స్పందించి కాలుష్య నియంత్రణ మండలి అధికారుల కార్యకలాపాలపై పర్యవేక్షణ చేయడంతోపాటు, నిబంధనలకు విరుద్ధంగా కాలుష్యం వెదజల్లే పరిశ్రమలపై చర్యలు తీసుకోవాలని ప్రజలు కోరుతున్నారు.



# సక్రమంగా గ్యాస్ సరఫరా చేయాలి!

## • కావలిలో డిఎస్ఓ ఆదేశం

గ్యాస్ ఏజన్సీలు వినియోగదారులకు సకాలంలో సక్రమంగా గ్యాస్ పంపిణీ చేయాలని, ఎక్కడైనా అవకతవకలకు పాల్పడినట్లు తెలిస్తే లైసెన్సులు రద్దు చేస్తామని జిల్లా పౌరసరఫరాల శాఖాధికారి ఉమామహేశ్వరరావు హెచ్చరించారు. కావలి పట్టణంలోని టిటిడి కళ్యాణ మండపంలో జరిగిన గ్యాస్ వినియోగదారుల అవగాహన సదస్సుకు ఆయన ముఖ్యఅతిధిగా హాజరై ప్రసంగించారు. వినియోగదారుల సూచనల ఆధారంగా గ్యాస్ పంపిణీలో మార్పులు తీసుకవచ్చేందుకు నిర్దిష్ట ప్రణాళికలు రూపొందించనున్నట్లు వెల్లడించారు. సిలిండర్ల పంపిణీ సక్రమంగా వుండడం లేదని, ఫోన్‌లు ఎత్తరని, నిర్ణీత సమయానికి గ్యాస్ సిలిండర్లు అందజేయరని, దురుసుగా జవాబు చెప్తున్నారని వీరిపై ఎందుకు చర్యలు చేపట్టరని పలువురు వినియోగదారులు డిఎస్ఓను నిలదీశారు. దీనికి ఆయన స్పందిస్తూ వినియోగదారులను వేధించినా, సక్రమంగా పంపిణీ చేయకపోయినా ఉపేక్షించేది లేదన్నారు. సిలిండర్లు పంపే వాహనంతోపాటు తూకపు యంత్రాన్ని పంపాలని ఏజన్సీలకు సూచించారు. ప్రతి ఏజన్సీ రెండు ల్యాండ్ ఫోన్ నెంబర్లు, సెల్ నెంబర్ వినియోగదారులకు ఇవ్వాలని, గ్యాస్‌బుక్ చేసిన వారం రోజుల్లోగా పంపిణీ జరగాలని ఆదేశించారు.



చెన్నూరు అప్పర్ ప్రైమరీ స్కూల్‌లో విద్యా చైతన్య వారోత్సవాలను పురస్కరించుకొని విద్యార్థుల తల్లితండ్రులకు ప్రోత్సాహకాలను అందిస్తున్న గూడూరు సబ్ కలెక్టర్ వీరపాండ్యన్. ప్రక్కన సిఐడి ఇన్స్‌పెక్టర్ సుబ్బారావు, వదాన్యుడు జయరామిరెడ్డి, సుధాకర్, మాజీ సర్పంచ్ రాజశ్వేర్‌రెడ్డి.



జ్యోతిరావు పూలే జయంతిని పురస్కరించుకొని గూడూరు ప్రభుత్వ ఏరియా ఆస్పత్రిలోని రోగులకు పండ్లు పంచుతున్న బిసి సంఘం జిల్లా కన్వీనర్ బాలాజీరాజు, ఉదతా శరత్, గెరిటి నారాయణ తదితరులు.

# ప్రజాసమస్యలపై పోరాడితేనే మనుగడ!



ప్రజలతో నిత్య సంబంధాలు పెట్టుకొని వారి సమస్యల పరిష్కారానికి కృషి చేసినట్లయితేనే పార్టీకి మనుగడ వుంటుందని సిపిఎం జిల్లా కార్యదర్శి జక్కా వెంకయ్య కార్యకర్తలకు పిలుపునిచ్చారు. ఇటీవల నరుకూరులో జరిగిన సభలో పాల్గొన్న ఆయన పార్టీ పనితీరు తదితర అంశాలపై ప్రసంగించారు. పార్టీని మరింతగా బలోపేతం చేసి ప్రజలలోకి తీసుకవెళ్లేందుకు కృషి చేయాలన్నారు. పార్టీ ద్వారా పొందిన అనుభవాన్ని, కార్యకర్తల అభిప్రాయాలను

## పార్టీ శ్రేణులకు జక్కా వెంకయ్య సూచన

పరిగణలోనికి తీసుకోవాలన్నారు. స్థానిక సమస్యలపై దృష్టి సారించి వాటి పరిష్కారానికి చర్యలు చేపట్టాలన్నారు. జిల్లా సెక్రటరియేట్ సభ్యుడు మోహన్‌రావు దేశంలో ఇటీవల జరిగిన 2జి స్పెక్ట్రం, కామన్‌వెల్త్ గేమ్స్, గాలి జనార్ధన్‌రెడ్డి, కర్నాటక మాజీ ముఖ్యమంత్రి యడ్యూరప్ప, జగన్‌పై సిబిఐ విచారణలను ప్రస్తావించారు. జిల్లా కమిటీసభ్యుడు గంగపట్నం రమణయ్య, పొట్టేపాళెం చంద్రమౌళి తదితరులు మండలంలో పార్టీ పనితీరు, ప్రజాసమస్యల పట్ల చేపట్టిన ఆందోళన కార్యక్రమాలను వివరించారు. ఈ సమావేశంలో ప్రజానాట్య మండలి జిల్లా కార్యదర్శి విజయకుమార్, ఏడుకొండలు, నందయ్య, డాక్టర్ సుబ్బారావు, చలపతి, ఆంజనేయులు తదితరులు పాల్గొన్నారు.

గూడూరు నియోజకవర్గంలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ వినూత్న కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది. గడపగడపకు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ పరిచయం పేరుతో నియోజకవర్గంలోని ఐదు మండలాల్లో ప్రతి గ్రామానికి వెళ్లేందుకు పార్టీ కార్యక్రమాన్ని రూపొందించారు. మొదటగా గూడూరు మండలంలోని మిట్టాత్మకూరు గ్రామం నుండి కార్యక్రమాన్ని పార్టీనేత పేర్నేటి శ్యాంప్రసాద్‌రెడ్డి ప్రారంభించారు. బత్తిన విజయకుమార్ గ్రామంలో గడప

## • గడపగడపకూ

# వైఎస్ఆర్ కాంగ్రెస్!

## గూడూరులో శ్రీకారం

గడపకు తిరుగుతూ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి హయాంలో జరిగిన అభివృద్ధి, ప్రవేశపెట్టిన సంక్షేమ పథకాలను వివరించారు. ఇప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం ప్రజలనెత్తిన ధరల భారాన్ని మోపుతోందని విమర్శించారు. జగన్ పట్ల ప్రజల్లో వున్న ఆదరణ ఎనలేనిదని ప్రభుత్వం ఎన్ని కుట్రలు పన్నినా, విచారణలు జరిపించినా ప్రజలు వైఎస్ జగన్ పక్షానే వున్నారని, వుంటారని స్పష్టం చేశారు.

# సర్వేపల్లిలో సాఫీగా రచ్చబండ

## ఫలించిన ఆదాల మంత్రాంగం

జిల్లాలో వివిధ ప్రాంతాలలో చేపట్టిన రచ్చబండ కార్యక్రమంలో రచ్చారావిళ్లు జరుగగా సర్వేపల్లి నియోజక వర్గంలో మాత్రం రచ్చబండ కార్యక్రమం సజావుగా సాగింది. ఈ విషయంలో ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి తగిన విధంగా వ్యవహరించారు. నియోజకవర్గంలోని వివిధ మండలాలలో తెలుగు దేశం, వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీలు బలంగా వున్నప్పటికీ ఆదాల తన పరపతి, వ్యక్తిగత పరిచయాలతో ఏ మండలంలోనూ రచ్చబండకు ఆటంకం కలుగకుండా, గొడవ జరగకుండా చేయగలిగారు. ఆయా మండలాల కాంగ్రెస్‌పార్టీ ముఖ్యనేతలను వేదికనెక్కించడంతోపాటు శాసన మండలి సభ్యుడు వాకాటి నారాయణరెడ్డి మైకునిచ్చి కాంగ్రెస్ ప్రభుత్వ పనితీరును చెవులు తూట్లు పొడిచేలా చెప్పించడంతో మొత్తం మీద రచ్చబండ సాఫీగా జరిగింది.

# ధర్మరాజస్వామి గుడి వెనుక చకచకా రోడ్డు పనులు

తాము చేపట్టే వ్యాపారానికి చిరు వ్యాపారులు అడ్డంగా వుండడంతో వారిని తొలగించేందుకు రంగం సిద్ధం చేశారు. వీరికి రాపూరు మాజీ శాసన సభ్యుడు ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి అండదండలుండడంతో అధికారులు వీరికి వత్తాసు పలకడంతో అవసరం లేని చోట రోడ్డు నిర్మాణానికి పనులు ప్రారంభించడం గూడూరులో గగ్గోలు రేపింది. పట్టణంలో పలు ప్రాంతాలలో రోడ్లు దెబ్బతిని అస్తవ్యస్తంగా వున్నాయి. వాటి గురించి పట్టించుకోని అధికారులు పాత బస్టాండు సమీపంలో ధర్మరాజస్వామి గుడి వెనుక ప్రాంతంలో ఆగమేఘాలపై రోడ్డును నిర్మించేందుకు సిద్ధం కావడం విమర్శలకు తావిస్తోంది. ఇక్కడ గత 60ఏళ్లుగా పలువురు చిరు వ్యాపారులు పాతబట్టలను విక్రయిస్తూ పొట్టపోసుకొంటున్నారు. ఈ మార్గం గుండా పెద్దగా రాకపోకలు వుండవు. అలాంటి చోట జల్ తుఫాను నిధులతో అత్యవసరంగా రోడ్డు నిర్మించడం వెనుక పెద్ద రహస్యమే దాగివుంది. రాజకీయ అండదండలున్న కొందరు బంగారు వ్యాపారులు నిర్మించే త్రిస్టార్ హోటల్‌కు ఇక్కడి పాత గుడ్డలమ్మే అంగళ్లు అడ్డంగా వున్నాయి. హోటల్‌కు వచ్చే వాహనాలకు పార్కింగ్‌కు ఇబ్బంది కలగకుండా వుండేందుకు ఒక పథకం ప్రకారం ఈ మార్గంలో రోడ్డు నిర్మించేందుకు సమయత్తం అయ్యారు. వీరికి అధికారులు సహకరించడంతో చిరువ్యాపారుల వేదన ఎవరికి పట్టకుండా పోతోంది. పట్టణంలో పలు ప్రాంతాలలో రోడ్డు దెబ్బతిని వున్నా పట్టించుకోని నేతలు, అధికారులు ఇలా చిరువ్యాపారుల కడుపు కొట్టడంపై సర్వత్రా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

# ఔరా... కంభం!

## పార్టీ మారిన తీరుపై తెలివిగా సముదాయింపు



ఉదయగిరి నియోజకవర్గంలో రాజకీయాలు రంగులు మారుతున్నాయి. బద్ధశత్రువులు మిత్రులుగా, మిత్రులు శత్రువులుగా మారుతుండడంతో రాజకీయం రంజుగా వుంది. నియోజకవర్గంలో మాజీ శాసనసభ్యుడు కంభం విజయరామిరెడ్డి మొదటి నుంచి కాంగ్రెస్ పార్టీకి బద్ధ విరోధి. బిజెపి జాతీయనేత ముప్పవరపు వెంకయ్యనాయుడు శిష్యరికంతో రాజకీయాలలో అడుగుపెట్టిన ఆయన రాజకీయ జీవితం రెండుదశాబ్దాలపాటు ఏ రాజ్యాంగబద్ధమైన పదవి దక్కకుండానే సాగింది. తర్వాత కాలంలో రెండుసార్లు ఎమ్మెల్యేగా విజయం సాధించాడు. మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డిపై మాజీ మంత్రి మాదాల జానకిరాం అండతో గెలవగలిగాడు. ఆ తర్వాత కాలంలో ఒక సామాజిక వర్గానికి ప్రతినిధిగా వున్న మాదాల వర్గాన్ని కంభం, ఆయన అనుచరులు ఇబ్బందిపెట్టడంతో రాజకీయాలు గందరగోళంగా మారాయి. అలాంటి కంభం విజయరామిరెడ్డి ఉన్నట్లుండి తెలుగు దేశం పార్టీ వీడి కాంగ్రెస్ పార్టీలో చేరడం పలువురిని ఆశ్చర్యపరచింది. కాంగ్రెస్‌పార్టీ అంటే పడని వ్యక్తి ఆ పార్టీ పంచన చేరడాన్ని చూసి నోరెళ్లబెడుతున్న పలువురు ఇదేంటని కంభంను ప్రశ్నిస్తే నేను ఎంఏ పొలిటికల్ సైన్స్ చదివానని చెప్తూ తిరిగి వారినే మీరు జాతీయపార్టీలో వున్నారా, ప్రాంతీయ పార్టీలో వున్నారా అంటూ ఎదురు ప్రశ్నిస్తున్నాడట. అదేమిటని అడిగితే ప్రాంతీయ పార్టీ అంటే వైఎస్ఆర్ కాంగ్రెస్ అని, జాతీయ పార్టీ అంటే కాంగ్రెస్‌పార్టీ అని విశదీకరించి చెప్తుండడంతో ఔరా కంభం అని చర్చించుకుంటున్నారు నియోజక వర్గ ప్రజలు.

# సబ్ కలెక్టర్ జోరుమీదున్నారు!

## ● గూడూరులో ఆక్రమణల తొలగింపుకు రంగం సిద్ధం

గూడూరులో ఆక్రమణకు గురైన ప్రభుత్వ స్థలాలను గుర్తించి వాటిలో చేపట్టిన నిర్మాణాలను తొలగించేందుకు రెవెన్యూ యంత్రాంగం సిద్ధమయ్యింది. గత కొంతకాలంగా పట్టణ పరిధితోపాటు చుట్టుప్రక్కల ప్రభుత్వ స్థలాలు అన్యాక్రాంతం అవుతున్న విషయమై పలువురు ప్రజలు, ప్రజాసంఘాల నేతలు అధికారుల దృష్టికి తీసుకొని పోయినా ఫలితం లేకుండా వుండింది. ఈ పరిస్థితులలో గూడూరుకు సబ్‌కలెక్టర్‌గా వచ్చిన వీరపాండ్యన్ ప్రభుత్వ స్థలాల ఆక్రమణలపై దృష్టిసారించడంతో నిన్నటి వరకు కుంభకర్ణ నిద్రలో వున్న అధికార యంత్రాంగంలో కదలిక వచ్చింది. రెండవ పట్టణ పరిధిలోగల వంకెనగుంట, పోలయ్యగుంట ప్రాంతాలలో రెవెన్యూ స్థలంలో చేసిన అక్రమ నిర్మాణాలను, గూడూరు చెరువులో వెలసిన కట్టడాలను గుర్తించిన రెవెన్యూ యంత్రాంగం వాటిని తక్షణం ఖాళీ చేయాల్సిందిగా ఆక్రమణదారులకు నోటీసులు జారీ చేసింది. వీటితోపాటు ప్రధాన కూడళ్లయిన సంగం థియేటర్ సెంటర్, బనిగిసాహెబ్‌పేట సెంటర్ వద్ద రోడ్డుకు ఇరువైపులా వున్న ఆక్రమణలను ఆర్‌అండ్‌బి, రెవెన్యూ సిబ్బంది కలసికట్టుగా సర్వే చేసి దుకాణాదారులకు నోటీసులు పంపారు. ఈ సారైనా అధికారులు నిజంగానే ఆక్రమణలను తొలగిస్తారా లేక స్థలాలను గుర్తించడం, నోటీసులు పంపడం వరకే చేసి చేతులు దులుపుకొంటారా అనే దానిపై పట్టణ ప్రజలు చర్చించుకొంటున్నారు.



వెంకటగిరికి సమీపంలోని చెలికంపాడు గ్రామంలో కైవల్యానది వరద ఉధృతికి దెబ్బతిన్న రోడ్డు.

## మర్రిపాడు అధికారుల తీరే వేరు!

మర్రిపాడు మండలంలో రెవెన్యూ కార్యాలయంలో అధికారులు అందుబాటులో వుండకపోవడంతో వివిధ సమస్యలపై కార్యాలయానికి వచ్చే అర్జీదారులకు సమాధానం చెప్పేవారే లేకుండా పోతున్నారు. చివరకు గ్రీవెన్స్‌డే కార్యక్రమం సైతం నామమాత్రంగా చేపట్టి అయిందనిపిస్తుండడంతో సమస్యలు పరిష్కారం కాక వివిధ ప్రాంతాల ప్రజలు కాళ్లరిగేలా తిరగాల్సి వస్తోంది. ఎమ్మార్వో సెలవులో వుండడం, డిప్యూటి తహశీల్దార్ ప్రజావిజ్ఞప్తుల దినానికి హాజరు కాకపోవడం, ఐసిడిఎస్

### ప్రజలకు అందుబాటులో వుండరు.

అధికారిణి సులక్షణ దేవి రిజిస్టర్‌లో సంతకం చేసి వెళ్లిపోవడంతో ఆర్‌ఐ, జూనియర్ అసిస్టెంటు మాత్రమే విధులు నిర్వహించాల్సి వస్తోంది. ఒక్క గ్రీవెన్స్‌డే నాడే కాకుండా సాధారణ రోజుల్లో సైతం రెవెన్యూ సిబ్బంది, అధికారుల పనితీరు సక్రమంగా వుండడం లేదని ప్రజలు ఆరోపిస్తున్నారు. విధులకు గైర్హాజరయ్యే సిబ్బందికి తోడు కార్యాలయంలో సిబ్బంది మధ్య వివాదాలు జరుగుతుండడం వర్గపోరు కారణంగా పనులు జరగడం లేదని ప్రజలు వాపోతున్నారు.

## ప్రజా విజ్ఞప్తుల దినాన్ని అడ్డుకొన్న పెన్నేపల్లివాసులు

ప్రభుత్వం తమకు పంపిణీ చేసిన భూములకు హద్దులు చూపకుండా అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరించడాన్ని నిరసిస్తూ ప్రజావిజ్ఞప్తుల దినాన్ని అడ్డుకొన్న ఘటన పెళ్లకూరు మండలంలో జరిగింది. మండలంలోని పెన్నేపల్లి గ్రామస్తులు భూముల విషయమై అధికారులు వ్యవహరిస్తున్న తీరుపై మండిపడ్డారు. షుమారు అరవైమంది ఎమ్మార్వో కార్యాలయాన్ని ముట్టడించి తమ నిరసన తెలిపారు. గ్రీవెన్స్‌డేను అడ్డుకొన్న వారు మాట్లాడుతూ ఏడేళ్ల క్రిందట పేదలైన తమకు 40 ఎకరాలు కేటాయించారన్నారు. ఆనాటి నుంచి తమకు ఇచ్చిన భూములకు హద్దులు చూపకుండా అధికారులు నాటకం ఆడుతున్నారని విమర్శించారు. తక్షణం తమ సమస్య పరిష్కరించేవరకు కదిలేది లేదని భీష్మించడంతో కార్యాలయంలో గందరగోళం నెలకొంది. ఎమ్మార్వో ఈశ్వరమ్మ వారి వద్దకు వచ్చి త్వరలో సర్వేయర్‌ను పంపి హద్దులు చూపుతామని హామీ ఇవ్వడంతో గ్రామస్తులు శాంతించారు.

## నత్తనడకన పంచాయితీ భవన నిర్మాణాలు!

వెంకటగిరి నియోజకవర్గంలో పంచాయితీ భవనాల నిర్మాణం నత్తనడకన సాగుతోంది. సర్పంచ్‌ల పదవీకాలం ముగియడం, ప్రత్యేకాధికారుల పాలన రావడంతో ఈ నిర్మాణ పనులు ముందుకు సాగడం లేదు. జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం ద్వారా ఈ నిర్మాణాలు చేపట్టారు. డక్కిలి మండలంలో 26 పంచాయితీలు వుండగా 15 పంచాయితీలకు కొత్త భవనాలను నిర్మించేందుకు రూ.1.5 కోట్లను ప్రభుత్వం మంజూరు చేసింది. ఒక్కొక్క భవనానికి 10లక్షల రూపాయలు కేటా

### ఎప్పటికి పూర్తయ్యేను?

యించారు. వీటిలో ఎనిమిది పంచాయితీల్లో అసలు పనులే ప్రారంభం కాలేదు. నిర్మాణాలు ప్రారంభమైన చోట పనులు నత్తనడకన సాగుతుండడంతో ఎప్పటికి ఇవి పూర్తవుతాయో తెలియని పరిస్థితి ఎదురౌతోంది. సర్పంచ్‌లు వుండగా వారి పేరుతో వర్క్ ఆర్డర్లు వచ్చాయి. వీరి పదవీకాలం ముగియడంతో వేరే వ్యక్తులు ఆ పనులు చేపట్టేందుకు ముందుకు రావడం లేదు. పంచాయితీ రాజ్ అధికారులు మాత్రం భవన నిర్మాణాలు చేపట్టేందుకు ఎవరు వచ్చినా వారి పేరునే వర్క్ ఆర్డర్లు ఇస్తామని చెప్తున్నారు.

# కోడూరులో తిష్టవేసిన సమస్యలు!

పేరుకు మేజర్ పంచాయితీ అయినప్పటికి కోడూరు పంచాయితీ పేరు గొప్ప ఊరు దిబ్బ అన్న చందంగా వుంది. నానాటికీ అభివృద్ధి పథాన ముందుకు పోవాల్సి వుండగా ఇక్కడ మాత్రం తిరోగమనంలో వుంది. గ్రామంలో ఎక్కడ చూసినా అస్తవ్యస్త పరిస్థితులే కన్పిస్తుంటాయి. రోడ్లు పూర్తిగా దెబ్బతిన్నాయి. ముఖ్యంగా కోడూరు బస్టాండు రోడ్డు, శివాలయం వీధి, నెల్లిమిట్ట కండ్రిగ రోడ్డు, కొత్తకోడూరు, పాత పట్టపుపాళెం మీదుగా వెళ్లే రోడ్లు ధ్వంసమైపోయాయి. పారిశుధ్యం క్షీణించి వుంది. శుభ్రపరచే దిక్కు లేకపోడంతో ఎక్కడ చూసినా అపరిశుభ్ర వాతావరణం తాండవిస్తోంది. వీధిలైట్లు వెలగక చిమ్మచీకటి అలుముకొని వుంటుంది పలు ప్రాంతాలలో. గతంలో సర్పంచ్‌లుగా పని చేసిన కావల్‌రెడ్డి వెంకటరమణారెడ్డి, రవీంద్రరెడ్డి, నరేంద్రరెడ్డి, వీరబోయిన పెంచలయ్య పాలనలో కొంత అభివృద్ధి జరిగింది. ఆ తర్వాత తెలుగుదేశం పార్టీకి చెందిన ఊటుకూరు శ్రీనివాసులు

### పేరు గొప్ప ఊరు దిబ్బ

సర్పంచ్‌గా వచ్చినా ఆశించినంత ప్రయోజనం లేకుండా పోయింది. కొత్తకోడూరుకు చెందిన దువ్వూరు సురేంద్రనాథ్‌రెడ్డి జాఫర్‌సాహెబ్ కెనాల్ పెత్తనం చేపట్టినా అభివృద్ధి జరగలేదు. మరో నేత కావల్‌రెడ్డి రవీంద్రరెడ్డికి పంచాయితీలో పట్టు వున్నా ప్రత్యక్ష రాజకీయాలకు దూరంగా వున్నాడు. తెలుగుదేశానికి చెందిన కావల్‌రెడ్డి శ్యాంసుందర్ రెడ్డి అక్కడ నుంచి వైఎస్ఆర్ పార్టీలోకి పోయి అక్కడా ఇమడలేక రాజకీయాలు ప్రక్కన పెట్టి రొయ్యల గుంటలు చూసుకొంటున్నాడు. మండల కాంగ్రెస్ అధ్యక్ష బాధ్యతలు చూస్తున్న కోడూరు దిలీప్‌రెడ్డి అంతో ఇంతో ప్రజాసమస్యలు పట్టించుకొంటున్నా, పంచాయితీకి రెగ్యులర్ కార్యదర్శులు లేకపోవడంతో పంచాయితీ పరిస్థితి రోజురోజుకు దిగజారిపోతోంది.

## ● నేతలతో కుమ్మక్కైన

# రెవిన్యూ సిబ్బంది!

నాలుగేళ్ల క్రిందట ఇచ్చిన ఇళ్ల స్థలాలను వెనక్కి తీసుకోనేందుకు అధికారులు కొందరు నేతలతో కుమ్మక్కు కావడం పట్ల బోగోలు మండలంలో గగ్గోలు రేగుతోంది. మండలంలోని చెన్నారాయునిపాళెం దళితులకు 2007వ సంవత్సరంలో ఇళ్ల స్థలాలు మంజూరు చేశారు. షుమారు 42 మందికి స్థలాలు కేటాయించగా అప్పుడు ఎమ్మెల్యేగా వుండిన విష్ణువర్ధన్‌రెడ్డి 24 మందికి పట్టాలను పంపిణీ చేశారు. మిగతా వారికి తర్వాత ఇస్తారని ప్రకటించారు. అప్పటి నుంచి పలుమార్లు ఎమార్వో కార్యాలయం చుట్టు తిరిగినా ఫలితం లేకుండా పోవడంతో కొందరు గృహాలు నిర్మించుకోగా మరికొందరు తమకు కేటాయించిన స్థలంలో గుడిసెలు వేసుకొన్నారు. ఈ పరిస్థితులలో తెలుగు

### మంజూరు చేసిన స్థలాలు తిరిగి స్వాధీన యత్నం!

దేశం పార్టీకి చెందిన కొందరు చోటా నేతలు రంగప్రవేశం చేసి ఇందిరమ్మ ఇళ్లు నిర్మించుకోకుండా గుడిసెలు వేసుకొని వున్న పేదల స్థలాలను సొంతం చేసుకొనేందుకు ప్రయత్నాలు ఆరంభించారు. కొందరు రెవెన్యూ సిబ్బందితో కుమ్మక్కై ఆ స్థలాలు స్వాధీనపరచుకొనేందుకు పేదలను బెదరిస్తుండడంతో వారు తమకు న్యాయం చేయాలంటూ అధికారులను కలిశారు. దీనికితోడు అక్కడ సర్పంచ్‌గా తెలుగుదేశం పార్టీలో వుండిన రమేష్, మరికొందరు పార్టీమారి వైఎస్ఆర్ కాంగ్రెస్‌లో చేరడంతో ఈ సమస్య రాజకీయ రంగు పులుముకొంది. పేదలకు న్యాయం జరగకపోతే సహించేది లేదని వైఎస్ఆర్ పార్టీ నేతలు అధికారులను కలసి హెచ్చరించారు.

# మాఫియా దందాలా ఇఫ్కో సెజ్!

### తిరుపతి ఎంపీ ఘాటు వాఖ్య



కొడవలూరు మండలం రాచర్లపాడు వద్ద గల ఇఫ్కో కిసాన్‌సెజ్ మాఫియా దందాలా తయారైందని తిరుపతి పార్లమెంటు సభ్యుడు చింతామోహన్ విమర్శించారు. ఇటీవల కావలికి వచ్చిన ఆయన మార్గమధ్యంలో రాచర్లపాడులో గల ఇఫ్కో భూములను పరిశీలించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఇఫ్కో కిసాన్ సెజ్ ఏర్పాటు చేస్తామని రైతుల నుంచి భూములు తీసుకొని ఎలాంటి పనులు చేపట్టకుండా జాప్యం చేస్తోందని విమర్శించారు. సెజ్‌ల పేరుతో పేదల కడుపుకొట్టి భూములు లాక్కొని బడా సంస్థలకు అప్పగించడం తప్ప మరెందుకు ఉపయోగపడడం లేదని వ్యాఖ్యానించారు. ఇలాంటి సంస్థలు దొంగసంస్థలయ్యాయన్నారు. స్థానిక శాసన సభ్యుడు బీద మస్తాన్‌రావు మాట్లాడుతూ కిసాన్‌సెజ్ నిర్మాణం పేరుతో భూములు తీసుకొన్న సంస్థ ప్రహరీ గోడ నిర్మించడం తప్ప ఎలాంటి పనులు చేపట్టకపోవడం దారుణమన్నారు. ఈ పరిస్థితుల్లో రైతుల దగ్గర్నుంచి తీసుకొన్న భూములను తిరిగి వారికే అప్పగించాలని డిమాండ్ చేశారు.

# నియమ నిష్టలతో కూడుకొన్న అయ్యప్పదీక్ష!



హరిహర తనయుడు అయ్యప్ప మాలధారణ ఎంతో నియమనిష్టలతో కూడుకున్నది. ఈ దీక్ష భక్తుల మన:శ్శరీరాలలోని అంతర్గత, బాహ్య కల్మషాలను క్షాళన చేసి పరిశుద్ధతను ప్రసాదిస్తుంది. అయ్యప్ప దీక్ష చేపట్టేవారు మండల (41) రోజులు కఠిన బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ చన్నీటిస్నానం, భూతలశయనం, పాదరక్షలు ధరించకుండా, ఒంటిపూట భోజనం చేస్తూ నియమబద్ధమైన జీవితం గడుపుతారు. తొలిసారి మాల ధరించే వారిని కన్నెస్వాములు అంటారు. కుండలిని జాగృతశక్తికి ప్రతీకలుగా అయ్యప్ప ఆలయ 18మెట్లను చెప్తారు. ఆ మెట్ల గుండా వెళ్లి ఆనందరూపుడిని దర్శించి తరిస్తారు. దేవ సేనా పతి అయిన షణ్ముఖరూపమే అయ్యప్ప. దేవతలను, రుషులను, మానవులను హింసించే రాక్షస జాతిని అంతమొందించడమే అయ్యప్ప పుట్టుకకు కారణంగా చెప్తారు. అయ్యప్పను ప్రతిఘటించడానికి రాక్షసజాతి స్త్రీ రూపంలో వచ్చేదని వాళ్లను నిరోధించడానికే అయ్యప్ప శాశ్వత బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంభించాడని చెప్తారు. పవిత్ర మార్గశిర మాసంలో దీక్ష చేపట్టి ఉత్తరాయణ పుణ్యకాలాన్ని సద్వినియోగం చేసుకునేదే అయ్యప్ప దీక్ష.

అయ్యప్పస్వామి జన్మవృత్తాంతం లోకకళ్యాణ కారకంగా చెప్తారు. విష్ణువు మోహిని అవతారంలో భస్మాసురుడిని సంహరించాక మోహిని రూపంలో వున్న విష్ణుమూర్తిని శివుడు మోహిస్తాడు. ఆ ప్రణయ సంగమ ఫలితంగానే అయ్యప్ప ఆవిర్భవించాడు. కేరళలోని పంబానది తీరాన హరిహరనందుడు జన్మించాడు. అప్పటి పంబలరాజు రాజశేఖరుడికి సంతానం వుండదు. ఆయన అడవిలో దివ్యతేజస్సుతో వున్న బాలుడిని చూసి అతనికి మణికంఠుడిగా నామకరణం చేసి పెంచుకోసాగాడు. ఆ తర్వాత రాజుకు సంతానం కల్గింది. ఎలాగైనా మణికంఠుడిని వదిలించుకోవాలని ఆలోచించిన రాణి వ్యాధివున్నట్లుగా నటించి, ఔషదానికి పులిపాలు కావాలని, తెచ్చి పెట్టమని అడవికి పంపుతుంది. అప్పుడు అయ్యప్ప మహిషి అనే రాక్షసిని సంహరించి, పులినెక్కి క్షేమంగా తిరిగి వస్తాడు. స్వామి దివ్యశక్తిమంతుడని గ్రహించిన రాజదంపతులు శబరిగిరిపై గుడి కట్టించారు. ఆనాటి నుంచి అయ్యప్ప దర్శనానికి దేశనలుమూలల నుంచి భక్తులు కాలినడకన వచ్చి దర్శిస్తుంటారు. శబరిమల యాత్రకు భక్తులు ఇరుముడిని నెత్తిన పెట్టుకొని బయలుదేరుతారు. అయ్యప్ప పులిపాల కోసం అడవికి వెళ్లేటప్పుడు రాజశేఖరుడు అతనికి పూజాసామగ్రి, ఆహార సామగ్రి రెండు మూటలుగా కట్టించాడట. అదేవిధంగా నేటికీ ఇరుముడి (రెండుముళ్లు) మూటను నెత్తిన పెట్టుకొని వెళ్తుంటారు భక్తులు. అయ్యప్ప దర్శనం తర్వాత ఆవు నేతితో స్వామిని అభిషేకిస్తారు. కొబ్బరి చిప్పలను అగ్నిగుండంలో పడవేస్తారు. "లోకవీరం మహాపూజ్యం సర్వ రక్షాకరం విభుం, పార్వతి హృదయానందం శాస్తారం ప్రణమామ్యహం" అంటూ స్వామిని ప్రార్థిస్తారు.

## ట్రంకు రోడ్డు

### ఏమంటివి... ఏమంటివి?



రాజకీయ నాయకులు చెప్పే మాటలకు చేతలకు పొంతన వుండదని మరో సారి రుజువు చేశాడు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి. నగరంలోని ఈ ప్రాంతం ఆప్రాంతమన్న తేడా లేనట్లుగా రోడ్లు దారుణంగా దెబ్బతినిపోయి ప్రజలు నానా పాట్లు పడుతున్నారు. నిత్యం ఈ రోడ్లపైన తిరిగే నేతలు, అధికారులకు చీమకుట్టినట్లు లేదు. కాని మైక్ పట్టుకొంటే చాలు పూనకం వచ్చినట్లు మాట్లాడుతారు. 25వతేది ముత్యాలపాళెం వద్ద సిమెంటురోడ్డు పనిని ప్రారంభించిన శ్రీధర్‌కృష్ణారెడ్డి మాట్లాడుతూ రోడ్లు అభివృద్ధికి చిహ్నాలని సూచించారు. అంటే నగరంలో రోడ్లు బాగోలేవు కాబట్టి అభివృద్ధి జరగలేదని ఎమ్మెల్యే చెప్పకనే చెప్పినట్లుంది. ఇది విన్నారా వివేకానందరెడ్డి గారు!

### సైడ్ బిజినెస్‌లు!




సైడు బిజినెస్‌లు చేయడంలో నెల్లూరు అయ్యోర్ల తర్వాతే ఎవరైనా... వీరు చేయని సైడు బిజినెస్ లేదు. అడిగేవారు లేకపోవడంతో ఇన్నాళ్లు ఈ వ్యవహారం దర్జాగా సాగిపోయింది. కానీ మనీ సర్క్యులేషన్ స్కీం దర్యాప్తు బాధ్యతలు సిబిసిఐడి స్వీకరించాక వీరి బిజినెస్ రెడ్‌హ్యాండెడ్‌గా దొరికిపోయింది. మనీ సర్క్యులేషన్ స్కీంలో వందలాది మంది టీచర్లు ఏజంట్లుగా పని చేసి కోట్లాదిరూపాయలు ప్రజలనెత్తిన శఠారీ పెట్టారని దర్యాప్తులో తేలింది. బాగా వ్యాపారం చేసిన అయ్యోర్ల జాబితాను సిబిసిఐడి డిఎస్పీ, డిఇఓకు పంపారు. ప్రభుత్వ వుద్యోగులుగా వుంటూ మరో వ్యాపారం చేయకూడదన్న నిబంధనల ఆధారంగా వీరిపై తీసుకొనే చర్యలేమిటన్న విషయమై నగరంలో తెగ చర్చ జరుగుతుంది.

### కోవూరు మే కౌన్ జీతేగా?




కౌన్‌బనేగా కరోడ్‌పతిలా ఉప ఎన్నిక జరగనున్న కోవూరు నియోజకవర్గంలో కౌన్ జీతేగా (ఎవరు గెలుస్తారు?) అన్న విషయమై ట్రంకురోడ్డులో వాదోపవాదాలు జరుగుతున్నాయి. తన గెలుపు తధ్యమని వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ తరపున పోటీ చేస్తున్న మాజీ శాసనసభ్యుడు నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి ప్రకటించారు. దమ్మంటే కోవూరులో తనతో పోటీ చేసి గెలవమని ఆనం సోదరులకు సవాల్ విసిరారాయన. ఈ సవాల్‌ను వాళ్లు స్వీకరించకపోయినా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి మాత్రం కోవూరులో కాంగ్రెస్ అభ్యర్థిదే గెలుపని ప్రకటించారు. తెలుగుదేశం అభ్యర్థిగా సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి పేరు ఖరారు చేయడంతో ఆయన కూడా ఇక్కడ అనుసరించాల్సిన వ్యూహంపై స్థానిక నేతలతో నిత్యం చర్చలు జరుపుతున్నారు. ఇక్కడ ఎన్నికలు జరిగి ఫలితం వచ్చే వరకు జనాలకు మంచి రాజకీయ కాలక్షేపమే.

### చెకింగ్ ఇబ్బందికరం!

ఒక వ్యక్తిని పబ్లిక్‌గా నఖశిఖా పర్యంతం పరిశీలించడం అవమానమే. అది మనం డబ్బులిచ్చి టిక్కెట్ కొని సినిమాకు వెళ్లినప్పుడు ఈ పరిస్థితి ఎదురు కావడాన్ని జనం జీర్ణించుకోలేకపోతున్నారు. ఈ పని చేస్తున్న సిబ్బందిపై వాదనకు దిగుతున్నారు. నెల్లూరులో కొత్తగా ప్రారంభించిన ఎస్–2 మల్టీప్లెక్స్ థియేటర్లలో సినిమా చూడను వెళ్లిన ప్రేక్షకులను లింగభేదం కూడా చూడక చెక్ చేసాకే లోనికి వదలుతున్నారు. గుట్కా, పాన్ పరాగ్, సిగరెట్లు, పేలుడు పదార్థాల నుంచి రక్షణ కోసం చెకింగ్ తప్పడం లేదని మేనేజ్‌మెంట్ చెబుతున్నా నెల్లూరు ప్రేక్షకులు మాత్రం దీన్ని సహించలేమంటున్నారు.

### వివేకా... తాత!



నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి గత రెండు మాసాలుగా నగరంలో వుండడం లేదు. ఆయన మోకాలికి చేయించుకొన్న శస్త్ర చికిత్స వికటించడంతో హైదరాబాద్‌లో వుండి విశ్రాంతి తీసుకొంటున్నాడు. గతంలో నగరంలో జరిగే ప్రతి ప్రారంభోత్సవం, పెళ్లిళ్లకు హాజరయ్యేవారాయన. ఇప్పుడైతే తన కుటుంబంలో జరిగే వేడుకలకే అతి కష్టం మీద వస్తున్నారు. 61ఏళ్ల వివేకానందరెడ్డి రెండువారాల క్రితం ఆయన రెండవ కోడలి శ్రీమంతపు వేడుకల్లో పాల్గొనను నెల్లూరు వచ్చారు. మళ్లీ 25వతేది తనను తాతను చేసిన మనుమడిని చూడను నగరానికి వచ్చారు. వివేకా నగరంలో లేకపోవడంపై ఆయన మోకాలికి అయిన శస్త్రచికిత్సపై ట్రంకురోడ్డులో ఎడతెగని చర్చ జరుగుతోంది.

## చెల్లెమ్మపైనే అందరి దృష్టి



వైఎస్.రాజశేఖర్‌రెడ్డి 'చెల్లెమ్మ' అంటూ ముద్దుగా పిలుచుకునే సబితా ఇంద్రారెడ్డి వైపు ఇప్పుడు అందరిదృష్టి కేంద్రీకృతమైంది. వై.ఎస్ హయాంలో గనుల మంత్రిగా సబిత ఎక్కడ పడితే అక్కడ సంతకాలు పెట్టింది. ఆమె హయాంలోనే గాలి గనులకు కాళ్లొచ్చి పరుగులు తీశాయి. ఒకే రోజులోనే 'గాలి' ఫైళ్లు క్లియర్ అయ్యేవి. ఇప్పుడు అదే స్పీడు సబిత మెడకు చుట్టుకునే ప్రమాదం ఏర్పడింది. సబిత గనుల మంత్రిగా ఉన్నప్పుడు కార్యదర్శిగా వున్న శ్రీలక్ష్మి ప్రస్తుతం జైలు పాలైంది. ఆమె గనుక అప్రూవర్‌గా మారి అసలు నిజాలు వెల్లడిస్తే సబితమ్మకు గండమే అంటున్నారు.




## ఆచితూచి ఐఎఎస్‌ల సంతకాలు



ఫైళ్లపై సంతకాలు పెట్టాలంటే ఐఎఎస్‌ల గుండెల్లో రైళ్లు పరిగెడుతున్నాయి. గాలిగనులు, ఎమ్మార్ విల్లాల కుంభకోణాల్లో సిబిఐ ఐఎఎస్‌లపైనే గురిపెట్టడంతో సచివాలయంలో ఫైళ్లు నత్తనడక నడుస్తున్నాయి. గతంలో మంత్రి పేషీ నుంచి ఫోను వస్తే చాలు ఐఎఎస్‌లు వెనుకా ముందూ చూడకుండా ఫైళ్లపై సంతకాలు పెట్టేవారు. ఇక ముఖ్యమంత్రి పేషీ ఫోన్ అయితే సరేసరి. ఆగమేఘాల మీద పనులు జరిగేవి. అయితే ఆరోపణలు వచ్చినప్పుడు, విచారణ జరిగినప్పుడు మాత్రం దర్యాప్తు బృందాలు ఐఎఎస్‌లనే తప్పుబడుతుండడంతో ఇప్పుడు ఐఎఎస్‌ల మైండ్ సెట్టింగ్‌లో మార్పు కనిపిస్తోంది. ప్రభుత్వపరంగా తీసుకునే నిర్ణయాల్లో అటు మంత్రులు, ఇటు అధికారులు సమాన బాధ్యత వహించాల్సిందేనంటూ కొత్త నినాదం ఎత్తుకున్నారు. ఇకపై నోటిమాటల్ని పట్టించుకోకుండా సంబంధిత మంత్రి నుంచి రాతపూర్వకంగా 'నోట్' వస్తేనే గానీ సంతకాలు పెట్టేది లేదని తేల్చిచెబుతున్నారు. సో... ఇప్పటికైనా ఐఎఎస్‌లకు జ్ఞానోదయం అయినట్లేనా?




నెల్లూరు కలెక్టరేట్ ఎదురుగా భారీ వర్షానికి నిలిచిపోయిన నీటిలో జనసంచారం.

## కుదురుకుంటున్న కిరణ్



కిరణ్ సిఎం కుర్చీఎక్కి ఏడాది పూర్తయ్యింది. ఈ ఏడాదిలో ఏ సిఎం కూడా ఎదుర్కోని సమస్యల్ని కిరణ్ ఎదుర్కొన్నాడు. ఒక దశలో కిరణ్‌ను మార్చాలని కూడా అధిష్టానం ఆలోచించింది. అయితే ఏ సమస్యకూ కూడా సీరియస్‌గా స్పందించకూడదన్న కిరణ్ పాలసీ ఆయనకు ప్లస్‌గా మారింది. గతంలో పి.వి.నరసింహారావు కూడా ప్రతీ సమస్యకు మౌనమే పరిష్కారం సూచిస్తుందనే వారు. కిరణ్ కూడా పివి పాలసీని ఒంటబట్టించుకొని ఏడాది గడిపేశాడు. దీంతో ప్రస్తుత పరిస్థితులన్నీ కిరణ్‌కు అనుకూలంగా మారుతున్నాయి. తెలంగాణ ఉద్యమం ఇప్పుడు దాదాపు చల్లబడింది. జగన్ రాద్ధాంతానికి ఎమ్మెల్యేలు వెళ్లిపోతారనుకుంటే వాళ్లు కాస్తా కాంగ్రెస్ కండువాలు వేసుకోడానికే మొగ్గుచూపుతున్నారు. దీంతో ప్రభుత్వం మైనారిటీలో పడిందన్న సమస్య కూడా ఓ కొలిక్కి వచ్చింది. రచ్చబండ, రూపాయికే కిలో బియ్యంతో సిఎం జనంలో చొచ్చుకుపోతున్నాడు. దీంతో కిరణ్ కుర్చీకి ఇప్పట్లో ఢోకా లేకుండా పోయిందంటున్నారు. అధిష్టానం కూడా కిరణ్ పనితీరుకు సంతృప్తిని వ్యక్తం చేస్తోందట. ఇంకేం... కిరణ్ గుడ్‌లక్!!



## రఘువీరాకు సిఎం 'చెక్'



రెవెన్యూ మంత్రి రఘువీరారెడ్డికి సిఎం కిరణ్ చెక్ పెట్టనున్నాడా? అంటే అవుననే అంటున్నారు సిఎం సన్నిహితులు. రెవెన్యూ మంత్రిగా రఘువీరా పనితీరుపై సిఎం పెదవి విరుస్తున్నాడట. గతంలో వ్యవసాయ మంత్రిగా వున్నప్పుడు మేఘమథనంకు సంబంధించి రఘువీరా చేతివాటంపై కిరణ్‌కు ఫిర్యాదులందుతున్నాయి. దీంతో రఘువీరా ప్రాధాన్యం తగ్గించాలనుకుంటున్నాడు సిఎం. రెవెన్యూ మంత్రిగా ఓ మహిళను నియమించాలనుకుంటున్నట్లు తన మనసులో మాటను కూడా బయటపెట్టాడు కిరణ్. సీనియర్ మంత్రి గీతారెడ్డికి గాని, ప్రస్తుత సమాచార మంత్రి డికె.అరుణకు గానీ ఈ అవకాశం దక్కవచ్చంటున్నారు. శీతాకాల అసెంబ్లీ సమావేశాల తర్వాత మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణ జరిగే అవకాశం వుంది. అందులో రఘువీరాకు 'శాఖ' చలనం తప్పక పోవచ్చు.




వివాహాది శుభకార్య ప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. శుభకార్యాలలో విందు వినోదాలలో పాలు పంచుకొంటారు. శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. పనిభారం ఆవేశాన్నిస్తుంది. తొందరపాటు నిర్ణయాలు వద్దు. ఓపిక అవసరం. విద్యార్థులు ప్రయోజకులౌతారు. రాజకీయులకు బాగా సాగుతుంది. వ్యాపారులు భాగస్వాములతో జాగ్రత్తగా వుండాలి.




చిన్న చిన్న విరోధాలు మనశ్శాంతిని చెడగొడతాయి. మనశ్శాంతికై దేవాలయాలకు వెళతారు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. కళత్ర ఆరోగ్యం అంతంత మాత్రమే. దూరప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. మాటలు వదలడంలో జాగ్రత్త అవసరం. మనశ్శాంతికై దేవాలయాలకు వెళతారు. వివిధమార్గాల ధనప్రాప్తి. సోదరుల తోడ్పాటు చక్కగా వుంటుంది. వృథా వాదాలకు దిగవద్దు.




కళత్ర ఆరోగ్యం, సంతానమూలంగా మానసిక వేదనకు గురౌతారు. ప్రయాణాలు కోరినరీతిలో జరుగవు. ముందుచూపుతో అడుగేయాలి. ప్రతి విషయంలో ఎదుటివారు తప్పుగా అంచనా వేస్తారు. ముఖ్యమైన వాటిని వాయిదా వేయడం మంచిది. నరాలకు సంబంధించిన బాధలధికం. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు తీరని వేదన చోటు చేసుకొంటుంది.




వృత్తి ఉద్యోగాల్లో కోరుకొన్న మార్పు చేర్పులు జరిగే సూచనలు. లేదా నూతన ఉద్యోగ ప్రాప్తి. శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. సంతాన కారణంగా మనశ్చింత. సరైన నిర్ణయాలు తీసుకోలేరు. మిత్రులతో కలసి వినోదయాత్రలు చేసే అవకాశాలున్నాయి. వ్యాపారవిస్తరణకు నూతన ప్రయత్నాలు చేస్తారు. కొత్త విషయాలు తెలుసుకోనే ప్రయత్నాలు చేస్తారు. ప్రభుత్వం ద్వారా ఆదాయాలు.




శారీరక మానసిక బాధలు తప్పవు. బంధుమిత్ర సమాగమం ఊరటనిస్తుంది. వ్యాపారులకు గడచిన వారంలో కన్నా ఈ వారం కొంత మేలు. అప్పులు తీరుతాయి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. ఇంటిలో వివాహసంబంధ విషయాలు ప్రస్తావనకొస్తాయి. రాజకీయులకు దురదృష్టకాలం. ఉద్యోగులకు గొడవలతో సాగుతుంది. గృహిణులు అనుకొన్న రీతిలో హాయిగా కాలక్షేపం చేస్తారు.




మానసిక ఆందోళనకు గురౌతారు. ఆగిన పనులు నిదానంగా సాగుతాయి. పాదాలకు గాయాలు తగిలే అవకాశం. ఆరోగ్య విషయంలో శ్రద్ధ అవసరం. కుటుంబంలో కలతలకు అవకాశాలు. ధన విషయాలలో లోటు లేదు. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. ఉద్యోగులకు పై అధికారుల నుండి నిరాదరణ. రాజకీయులకు ఉత్తమకాలం. వ్యాపారులకు మంచి లాభావకాశాలు.

# వారఫలాలు

*తేది 3-12-2011 నుండి 9-12-2011 వరకు వృశ్చికంలో రవి, బుధ, రాహువులు; ధనుస్సులో శుక్రుడు; మేషంలో గురువు; సింహంలో కుజుడు; తులలో శని; వృషభంలో కేతువు; కుంభ, మీన, మేష, వృషభాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

6తేదీ గీతాజయంతి.

**శుభ ముహూర్తాలు**

4తేదీ కర్కాటక లగ్నాన రా.08.00 నుండి 10.00 గంటల వరకు. కన్యా లగ్నాన రా.01.00 నుండి 02.00 గంటల వరకు.

5తేదీ ధనుర్ లగ్నాన మ.08.00 నుండి 10.00 గంటల వరకు. మకర లగ్నాన రా.09.00 నుండి 11.00 గంటల వరకు.

9తేదీ కన్యా లగ్నాన రా.01.00 నుండి 02.00 గంటల వరకు శుభముహూర్తాలున్నాయి.

**డిసెంబర్ తిథులు**

**మార్గశిర శుద్ధ**

| | | | |
|---|---|---|---|
| 3 | శని | అష్టమి | ఉ 06.40 గం.ల.వ |
| 4 | ఆది | నవమి | ఉ 07.59 గం.ల.వ |
| 5 | సోమ | దశమి | ఉ 09.47 గం.ల.వ |
| 6 | మంగళ | ఏకాదశి | ప 11.49 గం.ల.వ |
| 7 | బుధ | ద్వాదశి | ప 01.58 గం.ల.వ |
| 8 | గురు | త్రయోదశి | ప 04.09 గం.ల.వ |
| 9 | శుక్ర | చతుర్దశి | సా 06.01 గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




ఆప్తుల, విజ్ఞుల సలహాలు తీసుకోవాలి. సోదరుల తోటి సమస్యలు ఒక కొలిక్కి రావచ్చు. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా వుంటాయి. మోసానికి గురౌతారు. ప్రతి అడుగు ఆచితూచి వేయడం మంచిది. వ్యాపారులు భాగస్వాముల వల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. పనివారితో కఠినంగా మాట్లాడవద్దు. రాజకీయులు తోటి వారి ప్రవర్తనను జాగ్రత్తగా పరిశీలించాలి.




ఇంటిలో ఆనందదాయకమైన పరిస్థితులు చోటు చేసుకొంటాయి. అనవసరపు అప్రతిష్ఠలకు గురౌతారు. మాటల వల్ల వృథాగా ఇబ్బందులకు గురౌతారు. పురప్రముఖుల పరిచయం ఆనందాన్నిస్తుంది. మనశ్చాంచల్యం వుంటుంది. ఖర్చులు అధికం. జాయింటు వ్యవహారాలు చక్క దిద్దుకొంటాయి. ఆకస్మిక సంఘటనలకు అవకాశాలున్నాయి. ఆర్థికవృద్ధికి సంబంధించి చేసే పనులు ఫలవంతమౌతాయి.




సంతాన మూలంగా స్త్రీమూలంగా ధనప్రాప్తి. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. వారాంతంలో అధిక ఖర్చులు. పురోభివృద్ధి అన్ని రంగాలలో వుంటుంది. రాజకీయులకు అనుకూలమైన కాలం. విద్యార్థులకు మంచికాలం. వ్యాపారులు మంచి లాభాలనార్జిస్తారు. స్పెక్యులేషన్ లాభిస్తుంది. ఉద్యోగులు ప్రోత్సాహకరమైన వార్త వింటారు. అయినా ఓర్పు అవసరం. గౌరవమర్యాదలకు లోటు రావచ్చు.




అనుకొన్నపనులన్నీ అనుకొన్నరీతిలోజరుపుకొన్నా శ్రమ అలసట అధికం. ఆహార విషయంలో జాగ్రత్త. పనుల్లో ఆటంకాలధికం. ధనాదాయం బాగుంటుంది. శత్రువులు లొంగి నడచుకొంటారు. వ్యాపారులకు అంత యోగదాయకమైన కాలం కాదు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త. మనసు పరి పరి విధాల పయనిస్తుంది. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. విద్యార్థులకు చదువు సాగదు.




శుభకార్యాలలో విందు వినోదాలలో పాలు పంచుకొంటారు. శ్రమకు తగ్గ ఫలితం లభించకపోవచ్చు. పనిభారం ఆవేశాన్నిస్తుంది. తొందరపాటు నిర్ణయాలు వద్దు. ఓపిక అవసరం. వివాహాది శుభకార్య ప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. విద్యార్థులు ప్రయోజకులౌతారు. రాజకీయులకు బాగా సాగుతుంది. వ్యాపారులు భాగస్వాములతో జాగ్రత్తగా వుండాలి. నూతన పరిచయాలు సత్ఫలితాలనిస్తాయి.




బయటవారికోసం ఖర్చు చేస్తారు. ఆర్థిక విషయాలు నెమ్మదిగా చక్కగా సాగుతాయి. ప్రయాణాలు ఊహించని రీతిలో వుంటాయి. కొంత ప్రయత్నం తర్వాతనే పనులు సాగుతాయి. ప్రతి పనిలో దూకుడు వద్దు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. వ్యాపారులకు అత్యంత చక్కని కాలం. ఉద్యోగులకు మార్పుచేర్పులు చోటు చేసుకొంటాయి. రాజకీయులు పైవారి ఆదరణకు పాత్రులౌతారు.

# ప్రాచీనవాస్తు 'గుప్త శాస్త్రం' అభ్యాసకులకు శిరోధార్యం!

*డి.రవికుమార్ — హైదరాబాద్*

** నేను వాస్తు విద్యార్థిని. ప్రాచీన వాస్తు గ్రంథాలలో విశేష విజ్ఞాన సరస్వములనదగిన గ్రంథాలేవి?*

జ్యోతిష్యాంగమైన వాస్తు గ్రంథాలలో 'గుప్త గ్రంథ' విజ్ఞానం గొప్పది. గొప్ప వాస్తు గ్రంథాలు రాజమార్తాండం, వశిష్ట సంహిత, శిల్పసూత్రం, భోజరాజం, భూపాల వల్లభం, వాస్తు చింతామణి, కాశ్యప సంహిత. వీటిని భవిష్యత్తు కోసం భద్రపరచుకోండి.

*ఎన్.భార్గవి — తిరుపతి*

** మృగశీర్ష నక్షత్రానికి అధిపతి ఎవరు?*

మృగశిర నక్షత్రానికి అధిపతి చంద్రుడు.

*ఎ.శ్రీనివాసశాస్త్రి — చెన్నై*

** మెట్ల నిర్మాణంలో విశ్వామిత్ర, వశిష్ట, అగస్త్య వాస్తు విశ్లేషణల్లో లోపాలున్నాయి.*

మీరు చాలా పొరబడ్డారు. మెట్లు సమానంగా నిర్మించి కుడి, ఎడమలకు త్రిప్పడాన్ని 'తిర్యకృతం', స్తంభం చుట్టూ త్రిప్పడం 'వక్రం', స్తంభం ఏర్పాటుచేసి దాని చుట్టూ వర్తులాకారంలో త్రిప్పడాన్ని 'సర్పవేష్ఠన'మనీ వారు చెప్పారు.

*కె.ప్రవీణకుమారి — చెన్నై*

** నేను జ్యేష్ఠ నక్షత్ర జాతకుడ్ని. నేను ఏ వృక్ష పూజ చేయాలి?*

జ్యేష్ఠ నక్షత్ర జాతకులు కానుగ వృక్షానికి ప్రదక్షిణలు చేయాలి. విత్తు నూనె చర్మరోగాల్ని నివృత్తి చేస్తుంది. అనారోగ్య విషయంలో గ్రహగణన చేసి యంత్రాన్ని నిర్ధారిస్తారు.

*వి.ఎన్.శాంభవి — సికింద్రాబాద్*

** రాశి చెబితే మీరు రాశి అధిపతి పోషించవలసిన వృక్షం చెప్పగలరా?*

మీది 'మీనరాశి' కదా? అధిపతి బృహస్పతి. మీ వృక్ష దేవత(వటవృక్షం) మర్రిచెట్టు. వారానికో రోజు మర్రి వృక్షం క్రింద గడపడం మీ వింత వ్యాధికి పరిష్కారం. ఆయుర్వేద వైద్య గ్రంథం 'చరక సంహిత' కూడా ఈ అంశాన్నే బలపరుస్తున్నది.

*డి.పూజ — బెంగుళూరు*

** వివాహం విషయంలో వధూవరులకు భిన్న గోత్రాలు మంచిదేనా?*

సగోత్రీకుల వివాహాన్ని శాస్త్రం అంగీకరించదు. భిన్న గోత్రాలే మంచిది.

*వై.వి.శశికళ — గూడూరు*

** 'యంత్ర ప్రతిష్ట' తర్వాత శ్రీవారి ప్రవర్తనలో చాలా మార్పు వచ్చింది. కృతజ్ఞతలు.*

యంత్రంలో మంత్ర బీజాక్షరాలు, తాంత్రిక శబ్దాలు వుంటాయి. అందులోని లోహాలు సైంటిఫికల్‌గా ప్రభావం చూపిస్తాయి. మీకు మంచే జరిగింది. సంతోషం.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఓ.హనుమంతరావు — కందుకూరు*

** దక్షిణం రోడ్డు, తూర్పు గృహ నిర్మాణం. పెద్ద కుమారుడి పరిస్థితి ఏమీ బాగోలేదు.*

ఎడముఖం, పెడముఖం రీతిలో గృహ నిర్మాణం చేయరాదు. తూర్పు ఇంద్రస్థానం భ్రష్టమై కుమారులు అప్రయోజకులవుతారు. దక్షిణం బలహీనమై స్త్రీలపై ప్రభావం చూపిస్తుంది.

*ఇ.సూర్యకుమారి — సర్వేపల్లి*

** శివార్చనలో 'పత్రి' ప్రశస్తిని గూర్చి చెప్పండి?*

మంత్ర పుష్పకంలో 'బిల్వపత్రం' విశిష్టత చెప్పబడింది. అది శివార్చనకు శ్రేష్ఠమైనది. సర్వపాపాలనూ హరిస్తుంది. ఆయుర్వేద పరంగా బిల్వం ఓషధీయుక్తమైనది.

*ఎన్.దేవిమహారాణి — తడ*

** చేయకూడని నక్షత్ర సమయాల్లో ఈ మధ్య ఓ వివాహాన్ని నేను చూశాను.*

లగ్నబలం, గ్రహబలం బాగుంటే నక్షత్ర సమయాలు ఎటువంటి హానీ చేయవు.

*ఐ.శ్రవణ్‌కుమార్‌రెడ్డి — ఇందుకూరుపేట*

** పూర్వపు ఇల్లు, పూర్వీకులు సుఖంగా వుండి, ఇప్పటి తరానికి మాత్రం సమస్యలు వెల్లువలా పెల్లుబుకుతున్నాయి.*

అది కేవలం మీ భ్రమ. అవాస్తు దోషాలున్నప్పుడు సమస్యలు లేవంటే శాస్త్రం ఒప్పుకోదు. మీ సమస్యలు మీకు గొప్ప అయితే వారి సమస్యలు వారికి గొప్ప. మీ ఉత్తరంలో మీ తాతగారు ఇల్లు విడిచివెళ్లిపోయారన్నారు దీన్నేమంటారు.



ద్వితీయ వర్ధంతి







జననం
09-09-1928



మరణం
05-12-2009

## శ్రీమతి గునుపాటి లక్ష్మీకాంతమ్మ గారు

( స్వర్గీయ గునుపాటి రామచంద్రారెడ్డి గారి ధర్మపత్ని)

ద్వితీయ వర్ధంతి (05-12-2011) సందర్భంగా వారిని
స్మరించుకొంటూ...

—: కుటుంబ సభ్యులు :—

✍ అల్లూరు రహీం

యువత, ఆంజనేయులు వంటి హాఫ్ బీట్ చిత్రాలను తీసిన దర్శకుడు పరుశురాం తీసిన మూడవ చిత్రం సోలో. పేరుకు తగ్గట్టే ఈ చిత్రం సోలోగా వుంది. ప్రేమ, కుటుంబ బంధాలను మేళవించి తీసిన సినిమా అని దర్శకుడు చెప్పుకొన్నాడు. కాని ఈ జీవిత సంఘటనలను ఆయన స్క్రీన్‌ప్లేలో సరిగ్గా పేర్చలేక పోయాడు. 'సోలో' ద్వితీయార్ధం మరీ సాగతీత అయ్యింది. బాణంతో కెరీర్ మొదలెట్టిన నారా రోహిత్ ఈ చిత్రంలో హీరో. కాని హీరో ప్రేక్షకుల్లో ప్రత్యేకంగా గుర్తింబడేలా ఈ చిత్రంలో పాటలు, ఫైట్స్ లేవు. సినిమాలోని ఆరు పాటల్లో ఒక్క పాట కూడా బాగా లేదు. ముమైత్‌ఖాన్‌ను పెట్టి తీసిన 'సింగపూర్ పుట్టిన ఊరు' చరణంతో సాగే ఐటమ్ పాట ప్రేక్షకులను ఆకట్టుకోలేదు. మణిశర్మ సంగీతం మరీ డల్‌గా వుండి ఈ చిత్రాన్ని సర్వనాశనం చేసింది. హీరో సినిమా హాల్ వద్ద చేసే ఒకే ఫైట్




అతిగా వుంది. మెడికల్ కాలేజీలో ఎంఎస్ ఆర్థో చేసే స్టూడెంట్‌ను క్లాస్ నుంచి సాధారణ పేషంట్‌కు ట్రీట్‌మెంట్ చేయమని డీన్ పంపుతాడా? ప్రథమార్ధంలో హీరో, హీరోయిన్ ప్రేమ కోసం పరితపించే సన్నివేశాలు మాత్రం బాగున్నాయి. అదేవిధంగా హీరోయిన్, హీరోపై ప్రేమ పెంచుకోవడం హృదయాన్ని గిలిపెట్టిస్తాయి. మధ్యలో హీరోయిన్ తండ్రి ప్రవేశంతో ఈ ప్రేమ కథ గందరగోళంగా తయారయ్యింది. అసలీ పాత్ర రూపకల్పనే సరిలేదని చెప్పను సందేహించనక్కరలేదు. దర్శకుడే వ్రాసిన మాటల్లో  కెరీర్ కోసం పోరాడే వాడే హీరో. అమ్మాయిలకు ఏం నచ్చుతుందో తెలియదు. చేసిన చెడ్డయినా మంచైనా వెంటవెంటనే తెలియాలి. పుట్టేటప్పుడు నలుగురు లేరంటే అది నా తప్పుకాదు. చనిపోయినప్పుడు నలుగురు లేకపోతే అది నా తప్పే ఆలోచింపజేస్తాయి.




చిత్రకథలోనికి వెళ్తే గౌతమ్ (నారా రోహిత్) అనాధ. అనాధాశ్రమం నిర్వాహకుడు(రంగనాధ్) చేసిన సహాయంతోనే ఎయిర్‌సెల్ కంపెనీలో ఐదంకెల జీతగాడు అవుతాడు. తాను పెళ్లి చేసుకోవాలనుకొనే అమ్మాయికి పెద్ద కుటుంబం వుండాలని భావిస్తుంటాడు. ఈ క్రమంలో పెళ్లిళ్ల పేరయ్యలను కూడా కలుస్తాడు. ఓ రోజు సముద్ర తీరంలో గౌతమ్ కూర్చొని వుండగా ఓ అమ్మాయి కారుతో అతని బైక్‌ను ఢీ కొట్టిన సమయంలో వైష్ణవి(నిషా అగర్వాల్) వచ్చి అతన్ని సముదాయిస్తుంది. గౌతమ్‌ను వైష్ణవి బాగా ఆకర్షిస్తుంది. స్నేహితుడు(శ్రీనివాసులురెడ్డి) ద్వారా వైష్ణవి వివరాలు సేకరించగా ఆమె గీతం మెడికల్ కాలేజీలో ఎంఎస్ చదువుతుందని తెలుసుకొంటాడు. తనను ప్రేమించమని ఆమె వెనుకబడతాడు. వైష్ణవి తనది పెద్ద కుటుంబమని తండ్రి ఆజ్ఞ లేకుండా తాను ప్రేమించలేనంటుంది. కాని ఓ రోజు సినిమా హాల్‌లో ఆమె పట్ల అనుచితంగా ప్రవర్తించిన వ్యక్తిని గౌతమ్ దండించిన తీరు, పోలీసుస్టేషన్‌లో ఆమె పేరు, కుటుంబ వివరాలు వెల్లడించకుండా బయటకు తీసుకొచ్చిన వైనంతో ఫ్లాట్ అయిపోతుంది. పట్టణానికి పని మీద వచ్చే రఘుపతి నాయుడు (ప్రకాష్‌రాజ్) తన కుమార్తె వైష్ణవికి ఫోను చేసి ఎక్కడున్నావంటాడు. ఆమె కాలేజీలో వున్నానంటుంది. కాని గౌతమ్ బైక్‌పై కుమార్తెను చూసిన నాయుడు ఆమెను గ్రామానికి తీసుకెళ్లిపోతాడు. గౌతమ్ వెళ్లి తాను నిజాయితీగా వైష్ణవిని ప్రేమిస్తున్నానన్నా ఆయన ఒప్పుకోడు. తన కుమార్తెను పెళ్లి చేసుకొనేవాడు పెద్ద కుటుంబీకుడై వుండాలంటాడు. అనాధకు ఆమెనివ్వనంటాడు. ప్రేమ పెళ్లి చేసుకొని తన అక్క(జయసుధ) పడుతున్న పాట్లను ఏకరవు పెడతాడు. రఘుపతి నాయుడిని కష్టపెట్టలేక తిరిగి వచ్చేస్తాడు గౌతమ్. ఇంతలో వైష్ణవికి లండన్‌లో స్థిరపడిన విశ్వనాధం (సాయాజి షిండే) కుమారుని సంబంధం చూస్తాడు రఘుపతినాయుడు. విశ్వనాధం నిశ్చితార్థం సమయంలో అమ్మాయి మొఖంలో కళలేదంటే ఆమె గౌతమ్‌ను ప్రేమించిన సంగతి, తాను చెప్పాక అతను దూరం కావడాన్ని వివరిస్తాడు. అతడ్ని పిలిపిస్తే మాట్లాడుతానంటాడు విశ్వనాధం. గౌతమ్ వైష్ణవి పెళ్లి లండన్ యువకుడితో జరిగే వరకు వారింట్లోనే వుంటానంటాడు. ఈ సందర్భంగా జరిగే పలు సంఘటనలు రఘుపతినాయుడుకి జ్ఞానోదయం కలిగిస్తాయి. గౌతమ్, వైష్ణవిలకు పెళ్లి జరిపించడంతో చిత్రం ముగుస్తుంది.

హీరో నారా రోహిత్ తన పాత్రను చక్కగా పోషించాడు. అదే విధంగా హీరోయిన్ నిషా అగర్వాల్ కూడా బాగా నటించింది. ప్రకాష్‌రాజ్‌ది రొటీన్ పాత్ర. జయసుధ పాత్ర ప్రేక్షకులను పెద్దగా ఆకట్టుకోలేదు. సోలోగా నడిచే ఈ చిత్రాన్ని చూడడం కష్టమే.

## అదృష్టవంతురాలిని!



స్లమ్‌డాగ్ మిలియనీర్ చిత్రంతో హాలీవుడ్‌లో పేరు తెచ్చుకొన్న భారతీయ నటి ఫ్రిదా పింటో. ముంబాయిలో పుట్టి పెరిగిన ఫ్రిదా స్లమ్‌డాగ్... చిత్రంలో ఆస్కార్ పురస్కారాలు గెలుచుకొన్నాకే  హాలీవుడ్ దృష్టిలో పడింది. ఇప్పటికి మూడు ఆంగ్లచిత్రాల్లో నటించిన ఆమె చేతిలో మరో రెండు చిత్రాలున్నాయి. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమెను కలసి విషయాలు అడగ్గా రెండు అంతర్జాతీయ చిత్రాలు నా చేతిలో వున్నాయి. నేను ఎంతో అదృష్టవంతురాలిగా భావించుకొంటున్నాను. పెద్దపెద్ద నిర్మాణసంస్థల్లో నటించే అవకాశం కెరీర్ ప్రారంభ రోజుల్లోనే దక్కింది. నటించబోయే త్రిష్ణ, బ్లాక్ గోల్డ్ చిత్రాలు ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా వుంటాయి. నా సినీ ప్రయాణం ఇంతబాగా వుంటుందని మాత్రం నేను ఊహించలేదు. చాలా సంతోషంగా వున్నానని చెప్పుకొచ్చింది ఈ అమ్మడు.

## పెళ్లి కళ



తెలుగులో పలువురు అగ్రహీరోల సరసన హీరోయిన్‌గా నటించిన ముద్దుగుమ్మ స్నేహ తమిళనటుడు ప్రసన్నను పెళ్లి చేసుకోబోతుంది. వీరిద్దరిది ప్రేమ వివాహం. 'అచ్చముండు అచ్చముండు' తమిళ చిత్రంలో వీరు కలసి నటించిన సమయంలో ప్రేమ మొగ్గ తొడిగిందట.



నాగార్జున, వెంకటేష్, ఎన్టీఆర్ తదితర ప్రముఖ హీరోల సరసన నటించిన ముద్దుగుమ్మ మమతా మోహన్‌దాస్ తన చిన్ననాటి మిత్రుడు వ్యాపారవేత్త ప్రజీత్ పద్మనాభన్‌ను డిసెంబర్ 28న కాలికట్‌లో పెళ్లాడనుంది. ప్రజీత్‌కు కేరళతోపాటు బహ్రెయిన్‌లోనూ వ్యాపారాలున్నాయి.

## నేనింకా చిన్న పిల్లనే!



దబాంగ్ ఫేం హీరోయిన్ సోనాక్షి సిన్హా బాలీవుడ్‌లో మంచి ఊపుతో నటిస్తుంది. సినిమాల్లోకి వచ్చానని కెరీర్, అవకాశాలంటూ సీరియస్‌గా కనిపిస్తున్నానేమో గాని... నాలో ఎప్పుడూ ఒక చిన్నారి వుంటుంది. చదువుకొనే రోజుల్లో నవంబర్ 14తేది బాలల దినోత్సవ వేడుకల్లో చురుగ్గా పాల్గొనేదాన్ని ఆ వేడుకను పుట్టినరోజు వేడుకగా చేసేదాన్ని. విచారకరమైన విషయమేమిటంటే దేశంలో చాలామంది చిన్నారులు ఇప్పటికీ చదువులకు దూరంగా వుంటున్నారు. వాళ్లకు విద్యను అందించడం మన కనీసబాధ్యత. వీలు దొరితికే చాలు మా పొరుగింటి పిల్లలతో ఆటలకు దిగుతాను. అయితే నాకంటే నాకు నచ్చిన చిన్నారి మరొకరు వుండరని సోనాక్షి చెప్పుకొచ్చింది.

## స్లో అండ్ స్టడీ!



యువత, రైడ్, కందిరీగ చిత్రాల్లో హీరోయిన్ అక్షకు తగిన బ్రేక్ రాలేదు. తెలుగు చిత్రాల్లో ఓ వెలుగు వెలిగిపోవాలని ఎన్నో ఆశలు, మరెన్నో ఆశయాలతో వెండితెరపై అడుగు పెట్టిన తారల్లో అక్ష ఒకరు. అడపాదడపా వస్తున్న అవకాశాలు ఆమె కెరీర్‌ను నిలబెట్టే స్థాయిలో ఎందుకు వుండడం లేదని అక్షనే అడిగితే నా కెరీర్ ఇప్పుడు సంతృప్తికరంగానే వుంది. మంచి అవకాశాలు ఇప్పుడిప్పుడే వస్తున్నాయి. నా పాలసీ స్లో అండ్ స్టడీ. వచ్చిన అవకాశాల్లో మంచిది ఎన్నుకుంటూ పోవడమే తన పనని చెప్పుకొచ్చింది.

## తీరిక లేదండి!



హీరోయిన్లకు భాషా బేధం లేదంటారు. మంచిపాత్ర వస్తే ఏ భాషలోనైనా నటించడానికి సిద్ధమంటారు. త్రిష మాత్రం ఈ పద్ధతికి విరుద్ధం. ఆమెకు కన్నడ, మళయాళ చిత్రాల్లో నటించే అవకాశం వచ్చినా వదులుకొంది. కారణమడిగితే ఎక్కువ భాషల్లో నటించిన హీరోయిన్‌గా కీర్తి అక్కరలేదు. తెలుగు, మళయాళం ఎక్కడైనా సరే సౌకర్యంగా వుంటేనే నటిస్తా. కన్నడ, మళయాళ చిత్రాల గూర్చి నాకే మాత్రం తెలీదు. ఆ భాషలపై అవగాహన లేదు. తెలుగు, తమిళ చిత్రాలతో బిజీగా వున్నాను. ఒకేసారి నాలుగుగైదు భాషల్లో నటించి ఒత్తిడి కొనితెచ్చుకోనంటుంది.

● అవును...

## వైద్యసేవలు అందడం లేదు!

**ఒప్పుకొన్న జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి**



డాక్టర్ మాశిలామణి.

పట్టణ ఆరోగ్య కేంద్రాలలో ప్రజలకు సరైన వైద్యం అందడంలేదని సాక్ష్యాత్తు జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారే ఒప్పుకోవడం ఆశాఖ పనితీరును చెప్పకనే చెపుతోంది. డిఎం అండ్ హెచ్‌ఓ కార్యాలయంలో ఇటీవల వైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ మాశిలామణి పట్టణ ఆరోగ్య కేంద్రాల నిర్వాహకులు, వైద్యాధికారులతో సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన తమ శాఖ పనితీరుపై కుండబ్రద్దలు కొట్టినట్లు మాట్లాడారు. ఆరోగ్య కేంద్రాలలో ప్రజలకు సరైన వైద్యం అందడంలేదని, ప్రజలకు అందుబాటులో వైద్యులు ఉండడం లేదన్నది నిజమని స్వయంగా అంగీకరించారు. సరైన వైద్యసేవలు అందని కారణంగా ఆయా ప్రాంతాల ప్రజలు విషజ్వరాలు, అంటురోగాల బారినపడి తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారని తెలిపారు. ఈ విషయం జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి దృష్టికి రావడంతో ఆయనే స్వయంగా నగరంలో పలు ఆరోగ్య కేంద్రాలను పరిశీలించారన్నారు. ఆ తనిఖీల్లో వైద్యుల నిర్లక్ష్యం తేటతెల్లమైందని, దీంతో విధులను నిర్లక్ష్యం చేసిన వైద్యాధికారులకు మెమోలు ఇవ్వడం జరిగిందన్నారు. వీరిని చూసైనా మిగతా వారిలో మార్పు వస్తుందని, వైద్యసేవలు సక్రమంగా అందుతాయని ఆశిస్తే ఎలాంటి ఫలితం లేదన్నారు. ఆరోగ్య కేంద్రాల పనితీరులో మార్పురాలేదని అసంతృప్తి వ్యక్తం చేశారు. ఆరోగ్యం బాగోలేదని సాకులు చెపుతూ విధులకు హాజరుకాకపోవడం ఎంతవరకు సమంజసం అని ఆయన ప్రశ్నించారు. ఇకనైనా పద్ధతి మార్చుకోకపోతే ఆరోగ్య కేంద్రాలకు నిధులను నిలుపుదల చేస్తామని డిఎం అండ్ హెచ్‌ఓ హెచ్చరించారు.

## పేరుకే రచ్చబండ

**అర్జీలకు పరిష్కారం లేదు**

పాలకులు అట్టహాసంగా రచ్చబండ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నా, అధికారులు అర్జీలను స్వీకరిస్తున్నప్పటికీ అర్జీదారులకు సమస్యల పరిష్కారం కావడం లేదు. అధికారులకు వినతులిచ్చామని, న్యాయం జరుగుతుందని సంబరపడుతున్న ప్రజలకు నిరాశే మిగులుతుంది. 8 నెలల క్రిందట జరిగిన రచ్చబండ కార్యక్రమానికి రెండున్నర లక్షల వినతులు వచ్చాయి. ఇంతవరకు వాటి విషయమై అతీగతీ లేదు. ఈ ఏడాది జనవరి 24 నుంచి ఫిబ్రవరి 12వ తేది వరకు జరిగిన రచ్చబండ కార్యక్రమంలో ఇన్‌ఛార్జ్ మంత్రి పితాని సత్యనారాయణ, జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి పాల్గొన్నారు. రేషన్ కార్డులు, పెన్షన్లు, అభయ హస్తం, పావలా వడ్డీ, గృహ నిర్మాణం, ఉపాధి, రాజీవ్ ఆరోగ్యశ్రీ వంటి పథకాలకు ప్రాధాన్యమిస్తూ ఈ కార్యక్రమం నిర్వహించారు. ప్రజల నుంచి వచ్చిన వినతులను శాఖలవారీగా విభజించి నప్పటికీ ఇంతవరకు వాటి పరిష్కారమై ఎలాంటి సమాచారం లేదు. రేషన్ కార్డుల కోసం రచ్చబండలో 1,16,105 దరఖాస్తులు వచ్చాయి. పెన్షన్ల కోసం 42,232 మంది అర్జీలిచ్చారు. అభయహస్తం కోసం 8,299 మంది దరఖాస్తులు సమర్పించారు. పావలా వడ్డీ కోసం కొత్తగా 1350 సంఘాలు వినతి పత్రాలు అందించాయి. ఉపాధి కోసం 25,681 మంది దరఖాస్తు చేసుకొన్నారు. రాజీవ్ ఆరోగ్యశ్రీ కోసం 22,314 దరఖాస్తులు అందాయి. క్రొత్తగా ఇళ్ల కోసం 66,189 దరఖాస్తులు వచ్చాయి. వీటిలో ఏ ఒక్క దాన్నీ పరిష్కరించే దిక్కు లేకుండా పోయింది. 8 నెలలు గడుస్తున్నా కించిత్ స్పందన లేదు. ఈ పరిస్థితుల్లో తిరిగి అధికారులు అర్జీలు స్వీకరిస్తుండడం పట్ల సర్వత్రా నిరసనలు వ్యక్తం అవుతున్నాయి.

## పశుగ్రాస పథకానికి గ్రహణం



పశుగ్రాసం కొరతతో పిచ్చిమొక్కలు తిని పొట్ట నింపుకొంటున్న పశువులు.

మూగజీవాల ఆకలి బాధను తీర్చేందుకు ఏర్పాటుచేసిన పశుగ్రాస పథకానికి గ్రహణం పట్టింది. కోట్ల రూపాయల నిధులున్నా అధికారుల అలసత్వం, అన్నదాతల అవగాహన లోపం కారణంగా బృహత్తరమైన ఈ పథకం నిరుపయోగంగా మారుతోంది. జిల్లాలో దాదాపు 8.71 లక్షల గేదెలు, 2.13 లక్షలకు పైగా ఆవులున్నాయి. వీటికి గత కొన్నేళ్లుగా పశుగ్రాసం కొరత ఏర్పడింది. డెల్టా ప్రాంతంలో వరిసాగు చేసిన రైతులు ధాన్యంతోపాటు గడ్డిని అమ్మేస్తుండడం, వర్షాభావం తదితర కారణాల వల్ల గడ్డికి కొరత ఏర్పడింది. దీంతో పలువురు రైతులకు పశు పోషణ ఇబ్బందిగా పరిణమించింది. ఈ పరిస్థితుల్లో పశుగ్రాసం పథకానికి అధికారులు 18 కోట్ల రూపాయలను కేటాయించారు. ఉపాధి నిధుల మొత్తాన్ని పశుగ్రాసం పెంపకం కోసం మళ్లించారు. పశు సంవర్ధక శాఖ, డ్వామా అధికారులు మొదటగా 2,689 మంది రైతులను గుర్తించి, వారిలో 1948 మంది రైతులను ఎంపికచేసి 13 కోట్ల రూపాయలకు పరిపాలనా అనుమతులిచ్చారు. గడ్డిసాగుకు 400 మంది రైతులే ముందుకు రావడంతో వారికి రెండు కోట్ల రూపాయలు ఖర్చు పెట్టేలా మంజూరు పత్రాలు జారీ చేశారు. వీరిలో వాస్తవానికి 40 మంది మాత్రమే గడ్డి పెంపకం చేపట్టినట్లు సమాచారం. దీంతో కేవలం 1.28 కోట్లు మాత్రమే ఆరు నెలల్లో ఖర్చు చేయగలిగారు. అధికారులు దీనిపై తగినవిధంగా రైతులను ప్రోత్సహించకపోవడం, అవగాహనలేమి కారణంగా కొందరు రైతులు వెనకడుగు వేయగా, ఇప్పటికే అధిక శాతం మంది రైతాంగానికి ఈ పథకం అమలులో ఉన్నట్లే తెలియదు. దీనికి కారణం అధికారులకు తగిన శ్రద్ధ లేకపోవడమేనని చెప్పాలి. మరోవైపు పశు సంవర్ధక శాఖ, డ్వామాల మధ్య సమన్వయం లేకపోవడం ఈ పథకం దెబ్బతిని పోవడానికి కారణంగా చెప్తున్నారు.

## ప్రహసనంగా ఓటరు జాబితా సవరణ



ఎమ్మార్వో కార్యాలయంలో టేబుల్‌పై పడేసిన ఓటర్ల నమోదు దరఖాస్తులు.

ఓటరు జాబితాలో చోటుచేసుకొన్న అవకతవకలను సరిచేయాలని ఎన్నికల సంఘం నిర్ణయించినప్పటికీ జిల్లాలో ఆ దిశగా చర్యలు తీసుకోవడంలేదు. అవగాహనలేని సిబ్బందిని బూతుస్థాయి అధికారులుగా నియమించడం జరిగింది. దీంతో ఓటరు జాబితాలో మరిన్ని పొరపాట్లు దొర్లుతున్నాయి. 2012 జనవరి నాటికి 18 సంవత్సరాలు నిండిన వారిని ఓటరుగా నమోదు చేయడంతోపాటు ఓటరు ఫోటో జాబితాలో ఉండే విధంగా చర్యలు తీసుకోవాలి. కొందరు బూతుస్థాయి అధికారులు ఫోటోలు సేకరించి మండల తహశీల్దార్ కార్యాలయంలో అందజేస్తున్నా వాటిని భద్రపరచి జాబితాలో చేర్చేవారు లేకుండా పోయారు. నగరంలో ఇంటింటా సర్వే చేసి జాబితా సవరణ చేస్తామని ప్రకటించి 15 రోజులు గడిచినా ఆచరణకు నోచుకోకుండా పోయింది. ఇటీవల ఎన్నికల సంఘం అధికారులు వీడియో కాన్ఫరెన్స్ నిర్వహించి ఓటరు జాబితాను పటిష్టంగా రూపొందించాలని ఆదేశించారు. అందుకు సరేనన్న జిల్లా అధికారులు ఆ తర్వాత పట్టించుకోవడం మానేశారు.

## ట్రెజరీలో చెల్లింపులు ఆగిపోయాయి

ఖజానాపై చీటికి మాటికి రాష్ట్ర ప్రభుత్వం బిల్లులు మంజూరుకు సంబంధించి ఆంక్షలు విధిస్తుంది. ఈ ఆంక్షల కారణంగా వివిధ రకాల బిల్లులు నగదుకు నోచుకోకుండా నిలిచి పోతున్నాయి. ఒక ప్రక్క ప్రభుత్వానికి ఎటువంటి నిధుల కొరతలేదని ఆర్థిక శాఖ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రకటించారు. మంత్రి ప్రకటన చేసిన మరుసటి రోజు ట్రెజరీపై ఆంక్షలు విధించారు. ప్రభుత్వ కార్యాలయాలకు చెల్లించాల్సిన

**భవనాల అద్దె, విద్యుత్, టెలిఫోన్, టిఏ బిల్లులకు నో**

భవనాల అద్దె, విద్యుత్, టెలిఫోన్, వాహనాల అద్దె, సిబ్బంది టిఏ బిల్లులతోపాటు కాంట్రాక్టర్లు జారీచేసిన చెక్కులకు నగదు చెల్లింపులు నిలిపివేయాలని ఆదేశాలందాయి. ఈ ఆదేశాల నేపథ్యంలో అన్ని బిల్లులు ప్రక్కనపెట్టారు. త్రైమాసికం డిసెంబర్‌తో ముగియనున్నప్పటికీ నవంబర్ నెలాఖరుకు ట్రెజరీపై ఆంక్షలు విధించడం విశేషం. రాష్ట్ర ఖజానాకు వనరులు సమకూరనిదే విధించిన ఆంక్షలు సడలించే అవకాశం లేదు.




నెల్లూరు డికెడబ్ల్యు కాలేజీలో సొంత నిధులు 12 లక్షల రూపాయలు వెచ్చించి నిర్మించిన భోజనశాలను ప్రారంభిస్తున్న వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి. ప్రక్కన ప్రిన్సిపాల్ శారదాదేవి, సాయిభాస్కర్ రెడ్డి తదితరులు.

● ఆన్‌లైన్

## దరఖాస్తు పాట్లు!

● నిరుద్యోగులకు ఎన్ని కష్టాలు?

నిరుద్యోగులకు జిల్లాలో ఏడాది ముగిసేలోగా లక్ష ఉద్యోగాలు కల్పిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. రాజీవ్ యువ కిరణాలు పథకంలో భాగంగా ప్రభుత్వ, ప్రైవేట్ సంస్థల్లో ఉపాధి అవకాశాలు కల్పించాలన్న లక్ష్యంతో దరఖాస్తులను ఆహ్వానిస్తున్నారు. అయితే ఈ దరఖాస్తుల్ని నేరుగా కాకుండా ఆన్‌లైన్‌లో పొందు పరచాలని చెబుతున్నారు. దీంతో నిరుద్యోగులు తీవ్ర ఇక్కట్లు పడుతున్నారు. పట్టణ ప్రాంతాలకు చెందినవారికి ఆన్‌లైన్‌లో దరఖాస్తు చేసుకునేందుకు కొంతమేర అవకాశం ఉంది. గ్రామీణ ప్రాంతాలకు చెందినవారు ఆన్‌లైన్ కోసం పట్టణాలకు రావాల్సిన పరిస్థితి ఏర్పడింది. ప్రధానంగా మహిళలు మరొకరిపై ఆధారపడాల్సి వస్తుంది. తొలుత మండల కేంద్రాల్లోనే దరఖాస్తులు స్వీకరిస్తామని చెప్పిన అధికారులు పనిభారం తగ్గించుకునేందుకు ఆన్‌లైన్ ద్వారా దరఖాస్తు చేయాలని చెబుతున్నారు. నిరుద్యోగులపై మరింత ఆర్థిక భారం మోపకుండా సంబంధిత అధికారులు స్పందించాల్సిన అవసరం ఉంది.

## సంపదంతా ప్రజలకే అంకితం

16వ పేజీ కొరవ

జీవించడం ఒక్క టాటాలకే చెల్లిన మహనీయమైన ఆదర్శం.

### సాధారణ వుద్యోగిగా ప్రస్థానం మొదలు!

ప్రస్తుత ఛైర్మన్ రతన్ టాటా జీవితాన్ని అధ్యయనం చేస్తే ఈ నిరాడంబరతను వారెంత నిష్టగా పాటిస్తున్నారో అర్థమౌతుంది. రతన్ టాటాను తొలిగా కంపెనీలోకి ఒక సాధారణ ఉద్యోగిగా మాత్రమే తీసుకొన్నారు. టాటా స్టీల్ ఉక్కు కర్మాగారంలో ఫర్నేస్‌లోకి బొగ్గు వేసే ఉద్యోగం ఇచ్చారాయనకు. మూడేళ్లపాటు సాధారణ కార్మికులతో కలిసి ఆ నిప్పుల వేడిలో నలిగిన తర్వాత మాత్రమే యాజమాన్య విభాగంలోకి బదలీ చేశారు. అక్కడ కూడా పరీక్షే. నేషనల్ రేడియో అండ్ ఎలక్ట్రానిక్స్ అనే మూతపడిన కంపెనీకి ఆయన్ను 1971లో డైరక్టర్‌గా నియమించారు. దాన్ని తన ప్రతిభతో పునరుద్ధరించిన తర్వాత, 1977లో మరొక దివాలా స్థితిలో వున్న ఎంప్రెస్ మిల్స్ బాధ్యత అప్పచెప్పారు. అయితే ఇక్కడ రతన్ టాటా ప్రతిభ పనిచేయలేదు. అది 1986లో మూతపడింది. దాని తర్వాత టాటా ఇండస్ట్రీస్‌కు మార్చారు. అక్కడ రతన్ టాటా తన విశ్వరూపం చూపించాడు. టాటా చరిత్రలో తొలిసారిగా న్యూయార్క్ స్టాక్ ఎక్ఛేంజిలో ఆ కంపెనీని నమోదు చేయించగలిగాడు. ఆ నమ్మకంతోనే జెఆర్‌డి టాటా ఆయన్ను తన తర్వాత ఛైర్మన్‌గా నియమించాడు. తనపై జెఆర్‌డి వుంచిన విశ్వాసాన్ని రతన్ టాటా వమ్ము చేయలేదు. టాటా గ్రూప్‌ను అంతర్జాతీయ సంస్థగా పెంచాడు. ఖరీదైన కార్ల బ్రాండ్ జాగ్వార్ ఫ్యాక్టరీని కొని కంపెనీ ప్రతిష్టను ఆకాశానికి ఎత్తాడు. టిసిఎస్‌ను దేశంలోనే అతిపెద్ద కంప్యూటర్ సేవల సంస్థగా తీర్చిదిద్దాడు. తన కంపెనీకి ఇంత భూరి సంపదను సృష్టించినప్పటికీ, బొంబాయి నగరంలో రతన్ టాటా అత్యంత సాధారణ జీవితం గడుపుతున్నాడు. ఆయనకూ స్వంత ఇల్లు లేదు. స్వంత ఆస్తి అంటూ లేదు. కంపెనీ ఇచ్చే పెన్షన్‌తో మాత్రమే జీవించాలి. టాటా సన్స్‌లో తనకున్న స్వల్ప వాటాలను, తన పేరుతో నెలకొల్పబోయే స్వచ్ఛంద సంస్థకు త్యాగం చేయబోతున్నాడు.

### పిల్లలులేని వంశం

ఇక్కడ ఇంకొక విచిత్రమైన కుటుంబ సాంప్రదాయం కూడా వుంది. తొలినాటి ఛైర్మన్ జంషెడ్ జీ టాటాకు మాత్రమే పిల్లలున్నారు. ఆ తర్వాత అందరూ నిస్సంతులే. మొదటి ఛైర్మన్ కొడుకైన రెండవ ఛైర్మన్ దొరాబ్జీ టాటాకు పిల్లలు లేరు. దానితో ఆయన చెల్లెలైన వీరాబాయిజీ కుమారుడు నౌరోజీ సకలత్వాలా మూడవ ఛైర్మన్ అయ్యాడు. ఆయనకూ పిల్లలు కలగలేదు. దానితో, ఆయన తన తమ్ముడి కుమార్తె కొడుకైన జెఆర్‌డి టాటాను ఛైర్మన్‌గా ఎంపిక చేశాడు. ఆయనకూ సంతానం కలగలేదు. ఆయనకు ఇద్దరు తమ్ముళ్లు, ఇద్దరు చెల్లెళ్లు వున్నారు. కానీ టాటా సామ్రాజ్యం నిర్వహించే సమర్థత లేదనే భావంతో వీరెవరికీ అవకాశం ఇవ్వలేదు. రతన్ టాటాను ఎంపిక చేశాడు. ఆయన ఒక రకంగా చెప్పాలంటే టాటా కుటుంబానికి దూరపు చుట్టం మాత్రమే. రెండవ ఛైర్మన్ దొరాబ్జీ టాటా తమ్ముడికి కూడా పిల్లలు లేకపోవడంతో నవల్ హెచ్ టాటా అనే బంధువును దత్తత చేసుకొన్నాడు. ఆయన మనుమడే రతన్ టాటా. రెండవ ఛైర్మన్ వలెనే రతన్ టాటా కూడా పెళ్లి చేసుకోలేదు. అయితే ఆయనకు జిమ్మి టాటా అనే స్వంత తమ్ముడు, నోయల్ టాటా అనే పినతండ్రి కుమార్తె అయిన చెల్లెలు వున్నారు. కానీ తన తదనంతరం, టాటా సన్స్ లిమిటెడ్ సంస్థకు ఛైర్మన్‌గా వుండడానికి వారికి అవకాశం దక్కలేదు.

### టాటాల వారసుడు!

రెండేళ్లపాటు ఎన్నె పరిశీలనలు చేసి, ఎంతో అన్వేషణ జరిపి, పరీక్షలు పెట్టి, సైరస్ పల్లోన్జీ మిస్త్రీని తన వారసుడిగా ఎంపిక చేశాడు.

ఈ మిస్త్రీ, టాటా కుటుంబానికి కొత్తవాడేమీ కాదు. ఆయన తండ్రి పల్లోన్జీ మిస్త్రీ అపర కుబేరుడు. షాపూర్జీ పల్లోన్జీ అనే నిర్మాణ సంస్థకు అధిపతి. ఆయన సంపద విలువ 40వేల కోట్లకు పైగా వుంటుందని అంచనా. తొలితరం నాటి నుంచి కూడా మిస్త్రీ కుటుంబ సభ్యులు టాటా సన్స్ లిమిటెడ్‌లో వాటాదారులు. అయితే వారు టాటా కుటుంబీకుల వలె తమ వాటాలను ధర్మకార్యాలకు త్యాగం చేయకపోవడంతో, ఇప్పుడు టాటా సన్స్ లిమిటెడ్‌లో వారికి 18.5శాతం వాటా వుంది. వ్యక్తులుగా ఆ కంపెనీలో వారే అతి పెద్ద వాటాదారులు కావడం గమనించవలసిన విషయం. టాటాలది వీరిది బాదరాయణ సంబంధం.

తొలితరం ఛైర్మన్ జంషెడ్జీ నుసెర్వాన్‌జీ టాటాకు కున్వర్‌బాయి దాబూ అనే చెల్లెలు వుండేది. ఆమె, షాపూర్జీ ఇంటికి కోడలుగా వెళ్లింది. బహుశా, ఆమె ముని ముని మనుమడు అయ్యుంటాడు, ఇప్పుడు టాటా ఛైర్మన్‌గా ఎంపికైన మిస్త్రీ. టాటా గ్రూప్‌కు ఆయన ఆరవ ఛైర్మన్.

టాటా కుటుంబం పార్సీ జాతికి చెందినది. వారి మతం జొరాష్ట్రియనిజం.

## జగన్ రాయబారం

మొదటి పేజీ కొరవ

బెదరించాడని కొండారెడ్డి ఆ వాంగ్మూలంలో పేర్కొన్నాడు. ఆ ఒక్క ఆధారంతో తొందరపడకుండా జగన్‌ను కేసులో ఇరికించే బలమైన సాక్ష్యం కోసం వెతుకుతున్నారు సిబిఐ అధికారులు.

ఈ నేపథ్యంలో, జగన్ పినతండ్రి ఒంగోలు సుబ్బారెడ్డి ఢిల్లీలో అహ్మద్ పటేల్‌ను కలిశాడన్న వార్త గుప్పుమన్నది. సుబ్బారెడ్డి అంటే, జగన్ పార్టీలో కోపైలట్ వంటివాడు. జగన్ సూచన లేనిదే పచ్చి మంచినీళ్లు త్రాగను కూడా సాహసించని వీర భక్తుడు. కాంగ్రెస్‌తో జగన్ సంబంధాలు పూర్తిగా పటాపంచలైన సంగతి తెలిసీ ఆయన అహ్మద్ పటేల్‌తో రహస్య సమావేశం జరిపాడంటే, దాని వెనుక ఏదో ఒక మతలబు వుండాలి. జగన్ అనుమతి లేకుండా ఆ సమావేశం జరగను కాక జరగదు. ఈ కోణం నుంచి చూసినప్పుడు, జగన్ తరపున ఏదో ఒక రాయబారం మోసుకొని వెళ్లాడని చెప్పడంలో తప్పు లేదు. ఆ రాయబారం ఏమిటన్నది ప్రశ్న. కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీతో సంధికి జగన్ ప్రయత్నిస్తున్నాడా అన్నది ఒక అనుమానం. ఈ దశలో సంధి అంటే ఏమిటి? జైలుకు వెళ్లకుండా నిరోధించడమేనా? అదే నిజమైతే అందుకు ప్రతిగా సోనియమ్మకు తన తరపున ఏ హామీ ఇవ్వగలడు? చిరంజీవి వలె వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ విలీనం ప్రతిపాదిస్తాడా? ఈ దశలో అది సాధ్యమా? ఒకవేళ ఆయన అందుకు సిద్ధ పడినా జగన్‌ను క్షమించడానికి సోనియమ్మ ఇష్టపడుతుందా?

ఇవన్నీ వూహాజనితమైన ప్రశ్నలు. సుబ్బారెడ్డి, అహ్మద్ పటేళ్ల మధ్య సమావేశం ఒక్కటే నిజం.

## విఆర్ కాలేజీ

మొదటి పేజీ కొరవ

అని నివేదిక పంపాడు కలెక్టర్ ఆగ్నో. దానితో ప్రభుత్వం స్పందించి, నారాయణశెట్టి ప్రారంభించిన పాఠశాలకు ప్రభుత్వ గుర్తింపుతోపాటు, గ్రాంట్ కూడా మంజూరు చేసింది. అయితే ఆనాటి సిఎంఎం స్కూల్ యాజమాన్యం రెండవ స్కూల్ తెరవడానికి తాము వ్యక్తం చేస్తున్న అభ్యంతరాలను ఉపసంహరించుకోవాలంటే హిందు పాఠశాల నుంచి నారాయణశెట్టి గారిని తొలగించాలని షరతు పెట్టింది. దానికి తలవొగ్గిన ప్రభుత్వం ఇచ్చిన గ్రాంట్‌ను వెనక్కు తీసుకొన్నది. ఆనాటి మద్రాసు గవర్నర్ బకింగ్‌హామ్ దొర కూడా ఈ విషయంలో తానేమీ సహాయం చేయలేనని నారాయణశెట్టి గారి వద్ద నిస్సహాయత వ్యక్తం చేశాడు. అయినాసరే ఆనాటి నెల్లూరు పౌరులు పట్టువదలకుండా అణా రెండణాలు చందాలు దండి, హిందు పాఠశాలను నిలబెట్టారు.

ఈ దశలో ఆనాటి వెంకటగిరి జమీందారీ సంస్థానపు దివాను రహ్మతుల్లా ఎంతో ఉదార హృదయంతో క్రైస్తవ మత పెద్దల హింస నుంచి పాఠశాలను రక్షించడానికి ముందుకు వచ్చాడు. ఆనాటికి పాఠశాలకున్న 500 రూపాయలు అప్పును తన జేబులో డబ్బుతో తీర్చడంతోపాటు ఇప్పటి విఆర్ హైస్కూల్, కాలేజి ఆవరణం మొత్తాన్ని రెండువేల రూపాయలకకొని, పాఠశాలకు విరాళంగా ఇచ్చాడు.

### వెంకటగిరి రాజా చేసిన సహాయం

ఆ దశలో పాఠశాల కష్టాలు వెంకటగిరి రాజాగారి దృష్టికి వెళ్లాయి. క్రైస్తవమత దురాభిమానానికి ఒక హిందు పాఠశాల బలి కావడం అన్యాయమనే ఉద్దేశంతో ఆయన 15వేల రూపాయల విరాళం ఒకేసారి అందజేశారు. నూట పాతికేళ్ల క్రితం 15వేల రూపాయలంటే ఇప్పటి ధరలతో పోలిస్తే 150 కోట్ల రూపాయలతో సమానం. అందుకు ప్రతిగా ఆనాటి నుంచి హిందు పాఠశాల కాస్త, వెంకటగిరి రాజా కళాశాలగా పేరు మార్చుకొన్నది. ఆ తర్వాత కూడా రాజాగారు స్కూల్‌ను వదలి పెట్టలేదు. 1887లో మరొక పదివేల రూపాయలు విరాళం ఇచ్చి, ఇప్పుడు కాలేజి ఉన్న ప్రధాన భవనాన్ని కట్టించి, ఆనాటి మద్రాసు గవర్నర్ లార్డ్ కెన్‌మెరా చేత ప్రారంభం చేయించారు. మరికొంత కాలం తర్వాత, మరొక 11వేల రూపాయలు ఖర్చు చేసి, ఇప్పటి ఈస్ట్ హాల్ నిర్మాణం జరిపించారు. పాఠశాల, కళాశాల శాశ్వత ప్రాతిపదికన నడవాలనే ఉద్దేశంతో దాన్ని యాజమాన్యంలో పురప్రముఖులను భాగస్వాములను చేసి, ఒక సొసైటీగా రిజిస్టర్ చేయించారు.

### పెత్తనం ఏమిటి?

ఇదీ విఆర్ కాలేజి చరిత్ర. క్రైస్తవ మత దురభిమానుల నుంచి తమను తాము రక్షించుకోవడానికి, ఆత్మగౌరవం నిలబెట్టుకోవడానికి నెల్లూరు పౌరులు త్యాగభావంతో నెలకొల్పుకొన్న విద్యాసంస్థను క్రైస్తవ మత సంస్థగా మార్చడానికి ఆనం వారికి ఎవరు అధికారం ఇచ్చారు? అసలు కాలేజి మీద వారి బోడి పెత్తనం ఏమిటి? ఎంత కాలం?

విఆర్ కాలేజి స్థాపనలో కానీ, దాని అభివృద్ధిలో కానీ ఆనం కుటుంబానికి వీసమెత్తు ప్రమేయం లేదు. కేవలం నగరంలో తమకున్న రాజకీయ పలుకుబడితో కాలేజి సొసైటీని తమ హస్తగతం చేసుకొని, దశాబ్దాల తరబడి దాని నెత్తిన స్వారీ చేస్తున్నారు. కోట్లాది రూపాయలు దిగమింగుతున్నారు. కోర్టు కేసులను అడ్డం పెట్టుకొని, సొసైటీకి ఎన్నికలు జరపకుండా ఏళ్ల తరబడి కాలయాపన చేస్తున్నారు. ఇప్పుడు ఏకంగా కాలేజి అస్తిత్వానికే హాని కల్గిస్తున్నారు.

నెల్లూరు టౌన్‌లో క్రైస్తవ మతస్తుల ఓట్లు గణనీయమైన సంఖ్యలోనే ఉన్నాయి. వైఎస్ జగన్ స్వంత పార్టీ పెట్టిన తర్వాత వారంతా కాంగ్రెస్‌ను వదలి, జగన్ పక్షం చేరిపోయారు. ఒక క్రైస్తవుడు ముఖ్యమంత్రి అయ్యే అవకాశం జగన్ ద్వారా కల్గుతుందన్న ఆశే అందుకు కారణం. రాష్ట్రం మొత్తం మీద క్రైస్తవుల భావనలు ఇదేరకంగా ఉన్నాయి. అంత భారీ సంఖ్యలో ఓట్లు చేజారిపోతే తనకు రేపటి ఎన్నికలలో ప్రమాదమనే భయంతో వారిని ఆకట్టుకోవడానికి, తాను క్రైస్తవ మత అభిమానిని అని చెప్పుకోవడానికి విఆర్ కాలేజిని భ్రష్టు పట్టిస్తున్నాడు ఆనం వివేకానందరెడ్డి. కొత్త భవనాన్ని చర్చ్ నమూనాలో నిర్మించి, దాని ప్రధాన ద్వారం వద్ద ఏసు ప్రభువు పిల్లలతో సంభాషించే శిల్పాన్ని అమర్చి దాన్నొక క్రైస్తవ మత సంస్థగా మార్చిపారేస్తున్నాడు.

చాలా దుర్మార్గమైన ప్రయత్నం ఇది. గత శతాబ్ది కాలంగా విఆర్ కాలేజి నెల్లూరు నగరానికి విద్యాదానం చేసింది. అందులో చదివిన వారెందరో దేశ విదేశాలలో ప్రముఖ స్థానాలు అలంకరించారు. ఆకాశమంత ఎత్తుకు ఎదిగారు. తన ఎన్నికల ప్రయోజనం కోసం లక్షలాది మంది నెల్లూరు జిల్లా పౌరుల మనసులను గాయపరుస్తూ ఆ విద్యాసంస్థను నాశనం చేయచూడడం తీవ్రమైన అన్యాయం. విఆర్ కాలేజిలో చదివిన పాత విద్యార్థులందరూ ఖండించవలసిన అంశం ఇది. చట్ట ప్రకారం కూడా విద్యాసంస్థలో మత పరమైన కార్యక్రమాలు, బొమ్మలు పెట్టడం నేరం. తమను ఏ చట్టాలూ ఏమీ చేయవనే పొగరుతో ప్రవర్తించడం ఆనం సోదరులకు అలవాటైపోయింది. ఈ నిరంకుశ పోకడకు ఎక్కడో ఒక దగ్గర ఫుల్‌స్టాప్ పెట్టకుంటే నెల్లూరు పౌరుల గౌరవం మిగలదు.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

కోడ్‌గా పెట్టినట్లు చెప్పారు. ఇకపై ఈ రంగు యూనిఫాంతో సహకార శాఖ సిబ్బంది కన్పించనున్నారు. మంత్రి కాసు కృష్ణారెడ్డి సహకార సిబ్బందికి శాఖలోని సమస్యలపై పెద్ద క్లాసే తీసుకొన్నారు. జిల్లా కలెక్టర్, ఎస్పీ తనను వచ్చి కలవలేదని చిటపటలాడారు.

## పొరపాటు దొర్లింది

గతవారం 'జమీన్‌రైతు' సంచికలో ప్రచురించిన వారఫలాల్లో తిథులు, శుభముహూర్తాల తేదీల్లో తప్పులు దొర్లాయి. దీనికిగాను పాఠకుల మన్నింపు కోరుతున్నాం.

## జనవాణి

2వ పేజీ కొరవ

ఐలకు దిగడం బాధాకరం. తెలుగు సినిమా వజ్రోత్సవాల సందర్భంగా గొడవకు దిగిన చిరంజీవి, మోహన్‌బాబు సర్దుకొనిపోయిన నేపథ్యంలో మళ్లీ కొత్త గొడవ రేగింది. దీని ప్రభావం తగ్గించను హీరోలే రంగంలోకి దిగాలి.

కె.సుజాత కావలి

# విజిలెన్స్ నివేదికలపై ఎట్టకేలకు స్పందన!

వివిధ ప్రభుత్వశాఖలలో జరిగిన అవినీతి, అక్రమాల గురించి విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంటు సమర్పించిన నివేదికలపై ఎట్టకేలకు రాష్ట్రప్రభుత్వం స్పందించింది. ఏడాది క్రితం విజిలెన్స్ అధికారులు ఉపాధిహామీ పథకం, ఇందిరమ్మ పథకం క్రింద నిర్మించిన పక్కాగృహాలపై విచారణ జరిపారు. అవినీతి, అక్రమాలకు పాల్పడిన శాఖలపై నేరుగా చర్యలు తీసుకునే అధికారం విజిలెన్స్ అధికారులకు వుండదు. విచారణ సమయంలో బహిర్గతమైన అంశాలను నివేదికలో పొందుపరచి ఆ శాఖ ఉన్నతాధికారులకు పంపుతారు. అనంతరం రాష్ట్రప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి వెళ్తాయి. సాధారణ పరిపాలనశాఖ అధికారులు విజిలెన్స్ అధికారుల నుంచి అందిన నివేదికలను సమగ్రంగా పరిశీలించి సంబంధిత శాఖలకు పంపుతారు.

సంబంధితశాఖలు ఏవిధంగా అవినీతి, అక్రమాలకు పాల్పడ్డాయో నివేదికలో వుంటుంది. అందుకు కారకులైన అధికారులు, సిబ్బందిపై ఏవిధంగా చర్యలు తీసుకోవాలన్నది ఆశాఖ ఉన్నతాధికారులకు వదిలేశారు. విజిలెన్స్ నివేదికలపై ప్రభుత్వం చాలా ఆలస్యంగా స్పందిస్తుంటుంది. ప్రభుత్వంలోని కొందరు పెద్దలు తమ అధికారాన్ని ఉపయోగించి తమకు అనుకూలంగా వ్యవహరించే అధికారులను తప్పించేందుకు కృషి చేస్తుంటారు. ఈ క్రమంలో జిల్లాలోని పలు సంక్షేమ పథకాల్లో అక్రమాలకు పాల్పడినవారు అధికారపార్టీ నేతలను ఆశ్రయించారు. దీంతో ఏడాదిపాటు చర్యలు తీసుకోకుండా నిలుపుదల చేయించినట్లు సమాచారం. జిల్లాలో ప్రధానంగా జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం, ఇందిరమ్మ గృహనిర్మాణాల్లో భారీస్థాయిలో అవినీతి, అక్రమాలు జరిగినట్లు ప్రభుత్వానికి ఫిర్యాదులు వెళ్లాయి.

వీటిపై స్పందించిన ప్రభుత్వం తొలుత విజిలెన్స్ అధికారులు సమర్పించిన నివేదికల్లో సిఫార్సు చేసిన విధంగా చర్యలు తీసుకోవాలని సంబంధిత శాఖలకు ఆదేశాలు జారీ చేయడం జరిగింది. విజిలెన్స్ నివేదికలపై ఇక ఎటువంటి చర్యలు వుండబోవని భావించిన అక్రమార్కులు చర్యలు తీసుకోవాలని ఆదేశాలు జారీ కావడంపై ఆందోళన చెందుతున్నారు.

**వివిధ ప్రభుత్వ శాఖలతోపాటు ఉపాధిహామీ, ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణాల్లో జరిగిన అవినీతి, అక్రమాలపై విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ శాఖ విచారణ జరిపి ప్రభుత్వానికి పంపిన నివేదికలను పరిశీలించిన ఉన్నతాధికారులు స్పందించి తగిన చర్యలు తీసుకోమని ఆదేశించారు.**

తొలుత ఇందిరమ్మ గృహాలను బినామీ పేర్లతో మంజూరు చేసిన అధికారులు, దళారులపై చర్యలు తీసుకునేందుకు రంగం సిద్ధం చేస్తున్నారు. ముఖ్యంగా అధికార పార్టీకి చెందిన నేతలు చెప్పిన విధంగా గృహనిర్మాణశాఖ అధికారులు బినామీ పేర్లతో గృహాలు మంజూరు చేశారన్న ఆరోపణలు వున్నాయి. అక్రమాలకు పాల్పడిన వారి జాబితా జిల్లాకు చేరడంతో ప్రజాప్రతినిధుల చుట్టూ తిరుగుతూ గట్టెక్కించాలని వేడుకుంటున్నారు.

జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం అమలు తీరుపై మొదట్నుంచి అనేక సందేహాలు వ్యక్తమౌతూనే వున్నాయి. కూలీలకు జాబ్‌కార్డుల జారీ నుంచి నగదు చెల్లింపుల వరకు పలు అక్రమాలు జరిగాయి. కొన్ని మండలాల్లో కొందరు సిబ్బంది బినామీ కూలీలను నమోదు చేసి లక్షలాది రూపాయలను స్వాహా చేయడం జరిగింది. సామాజిక తనిఖీల్లో నిధుల స్వాహా విషయం బయటపడినా రాజకీయఒత్తిళ్ల కారణంగా బాధ్యులపై చర్యలు తీసుకోలేకపోయారు. తాజాగా విజిలెన్స్ నివేదిక ఆధారంగా చర్యలు తీసుకునేందుకు ఉపక్రమించారు. స్వాహా అయిన నిధుల్ని రికవరీ చేయడంతోపాటు క్రిమినల్ కేసులు నమోదు చేసే అవకాశాన్ని పరిశీలిస్తున్నారు.

ఏడాది తర్వాత విజిలెన్స్ నివేదికలకు కదలిక రావడం అభినందనీయం. ఇందిరమ్మ పథకం, జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకంలో ఎంతమందిపై చర్యలు తీసుకుంటారో వేచిచూడాలి.

# మహోన్నత మానవతావాదం 'మరో మైదానం'

ఆదిమ సమాజంలో మాతృస్వామ్య వ్యవస్థలో స్త్రీకి పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండేవి. గణానికి ఆహార సంపాదనలో, వేటలో ముఖ్య భూమికను పోషిస్తూ నాయకురాలిగా, తల్లిగా, ప్రియురాలిగా సర్వ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనుభవించింది. క్రమేణా పురుషుడు పితృస్వామ్య వ్యవస్థను నెలకొల్పాడు. ఈ వ్యవస్థలో స్త్రీని వంట మనిషి, పని మనిషి, పడక మనిషిగా మార్చివేసి చివరకు స్త్రీ అంగానికి "ఇనుప కచ్చడాలు" వేసే నీచ సంస్కృతికి దిగజారింది. తరువాత కాలంలో కొంత మార్పు, ప్రగతి వచ్చినా అనేక పాతివ్రత్య కాకమ్మ కథలతో, కల్లబొల్లి కల్పనా చాతుర్యముతో స్త్రీ స్వేచ్ఛను తన అదుపు ఆజ్ఞల్లో ఉంచుకొని స్త్రీని తనకు భోగ వస్తువుగా, స్వంత ఆస్తిగా మార్చుకొన్నాడు.

ఆధునిక కాలంలో 'చలం' అనే స్త్రీ పక్షపాతి, స్త్రీ మనస్సును చదివిన మనోవైజ్ఞానికుడు, "బ్రాహ్మణీకం"లోనున్న లోటుపాట్లు తెలిసిన బ్రాహ్మణుడైన గుడిపాటి వెంకటాచలం "మైదానం" నవల వ్రాసి 'రాజేశ్వరి' అను బ్రాహ్మణ వివాహితను "భువనైకనోద్ధిత సుకుమార శృంగార రతీదేవి"గా మలచి ఆనాటి మాలాంటి కుర్రకారునే గాక చాందస వాదులను కూడా తన ముగ్దమోహన మంత్రాక్షరాలతో సమ్మోహితులను చేసి, స్త్రీకి కూడా ఒక మనస్సుంటుందని, మగవానికి ఎలాంటి కోరికలు, అనుభూతులు, ఉద్వేగాలు, ప్రేమ, ఆనందం, దుఃఖం ఉంటాయో అలాంటివన్నీ ఆమెకు ఉంటాయని చాందసవాదులు, అభివృద్ధి నిరోధకుల ముందు స్త్రీ మానవీయకోణాన్ని "మైదానం" ద్వారా చక్కని అక్షర శిల్ప నైపుణ్యముతో రాజేశ్వరి వ్యక్తిత్వాన్ని మన ముందు ఉంచిన మహా మనిషి, మహాదార్శనికుడు, స్త్రీజన పక్షపాతి.

నేడు చలం వీరాభిమాని రజాహుస్సేన్, చలం "మైదానం" ఎక్కడ ముగిసిందో అక్కడ నుంచి మొదలు పెట్టి చలంను మరలా మనకు దర్శింపజేయడమేకాక, కొంత మంది గొప్ప రచయితలు, రచయిత్రులు భావించినట్లుగా 'చలం స్త్రీ స్వేచ్ఛపై ధైర్యంగా 75 సంవత్సరాల క్రిందటే సమాజం ముందు ప్రశ్న లేవనెత్తాడు గానీ సరైన పరిష్కారం చూపలేదు'. అనే విమర్శకు మంచి మానవీయ కోణంలో, మహోన్నత మానవతా విలువలతో స్ఫూర్తిదాయకమైన ముగింపు పలికాడు. నేడు చలం బ్రతికి ఉంటే "మైదానం" నాయకామణి రాజేశ్వరి జీవితానికి చక్కని పరిష్కారం చూపాలనుకొంటే తప్పకుండా రజాహుస్సేన్‌లాగే వ్రాసి ఉండేవాడు. 'మరో మైదానం' నవల 'మైదానం' ఒరిజినాలిటీని ఎచ్చటా దెబ్బతీయకుండా ప్రక్కదారి పట్టకుండా చలమే వ్రాశాడా అన్నంత సంభ్రమాశ్చర్యాలలో పాఠకుల్ని ముంచెత్తాడు. మానవతా విలువల పట్ల చలం 'మైదానం'లో ఎలా తపించాడో రజాహుస్సేన్ కూడా "మరో మైదానం"లో అంతే తపించాడు. "మరో మైదానం"లో మానవతా విలువల్ని మచ్చుకు కొన్ని రచయిత మాటల్లో మీ ముందు ప్రస్తావిస్తాను.

"నేను ఆడ ఖైదీ వార్డులో, మీరా మగఖైదీ వార్డులో చేయని తప్పుకు శిక్ష అనుభవిస్తున్నాం" ఇక్కడ పోలీస్ న్యాయవ్యవస్థలకు చెంపపెట్టు. సమయాలను బట్టి అమీర్ నా స్నేహితుడిగా, అన్నగా, తండ్రిగా, బిడ్డగా, గురువుగా, భర్తగా, ప్రియుడిగా, అధికారిగా ఉండేవాడు. మేం ఇద్దరం స్త్రీ, పురుష బేధం మరచి మంచి మిత్రులవలె ఆడుకునే వాళ్లం". స్త్రీ, పురుషుల మధ్య సంబంధాన్ని కేవలం కామ దృష్టితో చూసే వాళ్లకు పై మాటలు అర్థం కాక పోవచ్చు, ఎబ్బెట్టుగా తోచవచ్చు. "అమీర్‌ను నేను చంపానని భావించి, నా నేరాన్ని తనపై వేసుకున్న త్యాగశీలి నా మీరా..." " నా మీరా మీదున్న ప్రేమతో ఖయ్యూమ్(నీతిమాలిన జైలర్)కు లొంగిపోయాను. సెక్స్ పేరుతో వాడు ఎన్ని వికృత చేష్టలు చేసినా... శరీరాన్ని హింస పెట్టినా... నా మీరా కోసం సహించాను, భరించాను". ఇక్కడ ప్రేమంటే త్యాగమని, త్యాగమంటే మానవతావాదమని అర్థం చేసుకోవాలి. ఎదుటి వాళ్లతో నిమిత్తం లేకుండా శృంగారాన్ని ఓ పశువులాగ అనుభవించే ఖయ్యూమ్‌ను చూస్తే నా మీద నాకే కాదు స్త్రీజాతి మీదే జాలేసింది". "మైదానం"లో స్త్రీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలపై చలం ఎంత ఆవేదన చెందాడో అంతే ఆవేదన రజాహుస్సేన్ కూడా చెందాడు.

"నీ పెనిమిటి(రాజేశ్వరి భర్త) పెద్ద మనసు చేసుకొని వ్యాజ్యం గెలిపించబట్టే ఈ రోజు అమీర్ కుటుంబం పెళ్లాం, బిడ్డలు రోడ్డున పడకుండా సుఖంగా ఉన్నారు... నీ మొగుడు దేవుడే!... తన భార్యను లేపుకుపోయినా అమీర్ వ్యాజ్యం వాదించి వాడి పెళ్లాం బిడ్డలకు న్యాయం చేయడమంటే అదే త్యాగము, మానవతా విలువల పరిత్రాణము.

మానవత్వం పరిమళించే విజయమ్మ(క్రొత్త జైలర్) జైలును కారాగారముగా కాకుండా కర్మాగారముగా, దేశభక్తి నిలయంగా తన ప్రవర్తనా పరిమళాలు వెదజల్లి ఖైదీలందరినీ మారిన మనుషులుగా, సంఘజీవులుగా మారుస్తుంది. ముఖ్యంగా మన కథానాయకి రాజేశ్వరిని త్యాగశీలిగా, సంఘసేవికగా, నాయకురాలిగా మార్చివేస్తుంది. 1947 ఆగష్టు 15వ తేదీన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత తీవ్ర నేరస్తులు తప్ప మిగతా అందర్నీ విజయమ్మ విడుదల చేయిస్తుంది. తీవ్ర నేరస్తులను కూడా ఆ తరువాత కొంత కాలానికి విడుదల చేయిస్తుంది. జైలు నుండి విడుదలైన రాజేశ్వరి నైజాంలో ఓ కుగ్రామంలో మంగమ్మతో కలిసి 'స్వతంత్ర భారతి" పేరిట మహిళా సహకార సంఘాన్ని ఏర్పాటు చేస్తుంది. బాగా అభివృద్ధి పథంలో నడుపుతుంది. అది కాస్తా పత్రికలవాళ్ల దృష్టిలో పడుతుంది. "రాజేశ్వరి చేస్తున్న పనులు, గాంధీజీ కలలుగన్న గ్రామ స్వరాజ్యం ఇదేనని" పతాక శీర్షికన రాస్తారు. రాజేశ్వరి ఈ రోజున దీనజనులకు 'దిక్కు'గా ప్రవర్ధమానమౌతుంది. తన మాటలతో, ప్రవర్తనతో మీరాను కూడా సంఘజీవిగా మార్చి తన తల్లితండ్రుల దగ్గరకు పంపుతుంది.

పై విధంగా "మరో మైదానం" స్ఫూర్తి దాయకమైన ముగింపునిస్తుంది.

నాలో, నీలో మనలో మానవతా పరిమళాలు వెదజల్లిన "మరో మైదానం" నవలా రచయిత రజాహుస్సేన్ అభినందనీయులు.

## పుస్తకసమీక్ష

**మరోమైదానం**

రచయిత : ఎ.రజాహుస్సేన్

సమీక్షకుడు : రాచపాళెం రఘు

పేజీలు : 75 వెల : రూ.60/-

**ప్రతులకు**

తిరంగ పబ్లికేషన్స్, 11-5-410, ఫ్లాట్ నెం.402, నయీముల్ ఖాసిం అపార్ట్‌మెంట్ రెడ్‌హిల్స్, హైదరాబాద్ - 4

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/09-11
జమీన్‌రైతు

● పేరుకే పారిశ్రామికవేత్తలు

# సంపదంతా ప్రజలకే అంకితం!

**కంపెనీలను కుబేరస్థానంలో నిలిపి తాము మాత్రం కుచేలుర వలే జీవించడం టాటాలకే చెల్లింది.**

భారతదేశంలో అనాదిగా టాటా, బిర్లా అనే పేర్లు సంపదకు ప్రతీకలు. సాధారణ జనం వాడుకలో కూడా ఈ రెండు పేర్లు తరచూ వినపడుతూ వుంటాయి. కానీ, పత్రికలలో వచ్చే ప్రపంచ కుబేరుల జాబితాలో ఏ రోజు కూడా రతన్ టాటా అనే పేరు కనపడదు. వ్యాపార రంగంలో బొద్దుడని పసికందుల వంటి జిఎంఆర్, జివికె, ల్యాంకో, సత్యం, అదాని వంటి పేర్లు విన్న దుతూ వుంటాయే తప్ప, ఒక్క రోజు కూడా కుబేరుల జాబితాలో రతన్ టాటా పేరు చూసే అవకాశం లభించదు. దీనికి కారణం ఏమిటి?



టాటా సంస్థల స్థాపకుడు జంషెడ్ జీ.

## ఆదర్శప్రాయ కుటుంబం

ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకోవాలంటే, టాటా కుటుంబ ఉత్కృష్ట చరిత్ర సమస్తం అర్థం చేసుకోవాలి. నిష్కామకర్మ అనే హిందూ తత్వాన్ని మనసా వాచా కర్మణా ఆచరించే అత్యద్భుత వంశ చరిత్ర అది. దాదాపు నూట యాభై ఏళ్ల చరిత్రలో, ఆరు తరాలకు పైగా నడిచిన కుటుంబ జీవనంలో ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని మనసా వాచా ఆచరిస్తున్న ఆదర్శప్రాయ పురుషులు వారు. తాము సంపాదించే సంపద సమస్తం ప్రజలకే చెందాలన్న సిద్ధాంతాన్ని ఇన్నేళ్లుగా మనసావాచా కర్మణా పాటిస్తున్న వంశం, బహుశా ప్రపంచం మొత్తం మీద విరిదే అయి వుంటుందని నమ్మకంగా చెప్పవచ్చు.



సంస్థను అంతర్జాతీయ స్థాయికి చేర్చిన రతన్ టాటా.

## 80దేశాలలో వ్యాపారం

టాటాలది విశ్వమంతా విస్తరించిన వ్యాపార సామ్రాజ్యం. 80 దేశాలలో, దాదాపు 144 కంపెనీలను నిర్వహిస్తున్నారు వారు. వాటి విలువ దాదాపు నాలుగున్నర లక్షల కోట్ల రూపాయలు. (88 బిలియన్ డాలర్లు). ఇంత విస్తృతమైన కుబేర సామ్రాజ్యం మన దేశంలో మరొకటి లేదు. అయితే, ఈ కుబేర సామ్రాజ్యాధీశుడైన రతన్ టాటా మాత్రం కుచేలుడితో సమానం. ఆయనకు స్వంత ఇల్లు లేదు, ఏ కంపెనీలోనూ చెప్పుకోదగిన వాటా లేదు. టాటా కుటుంబం మొత్తం పరిస్థితి అంతే. 1868లో జంషెడ్‌జీ నుసెర్వాన్‌జీ టాటా బొంబాయి నగరంలో చిన్న పత్తి మిల్లు స్థాపించడంతో టాటా సామ్రాజ్య నిర్మాణం ప్రారంభమైంది. భారతీయ ఆత్మాభిమానానికి ప్రతీకగా భావించే బొంబాయి తాజ్ ప్యాలెస్ హోటల్ నిర్మాత కూడా ఆయనే. 1903లో, బ్రిటీష్ వారి అహంకారానికి విరుగుడుగా నిర్మించిన హోటల్ అది. ఆయన మరణానంతరం, ఆయన కుమారులు సర్ దొరాబ్జీ టాటా కుటుంబ పెద్దరికం స్వీకరించాడు. ఆయన నేతృత్వంలో ఉక్కు పరిశ్రమ ప్రారంభమైంది. దేశంలో మొదటిసారిగా జల విద్యుత్ కర్మాగారం నెలకొల్పిన దార్శనికుడాయన. ఆనాటికి మద్రాసు నగరానికి కూడా కరెంట్ అంటే ఏమిటో తెలియదన్న నిజాన్ని గుర్తు పెట్టుకొంటే, దొరాబ్జీ టాటా గొప్పదనం అర్థమౌతుంది. 1934లో మరణించే నాటికి, టాటాను ఒక ప్రతిష్ఠాత్మకమైన పారిశ్రామిక కుటుంబంగా తీర్చి దిద్దాడు దొరాబ్జీ టాటా. ఆయన తర్వాత నౌరోజీ షకలత్వాలా పెత్తనం చేపట్టాడు. కానీ నాలుగేళ్లలోపే ఆయన్ను మృత్యువు వరించింది. అటు పిమ్మట జెఆర్‌డి టాటాగా సుప్రసిద్ధుడైన జహంగీర్ రతన్‌జీ దాదాబాయి టాటా టాటా గ్రూప్ ఛైర్మన్‌గా బాధ్యత స్వీకరించాడు. దాదాపు యాభై ఐదు సంవత్సరాల పాటు ఆయన నేతృత్వంలో టాటా గ్రూప్ ప్రపంచ స్థాయి సంస్థగా అవతరించింది. టాటా స్టీల్, టాటా మోటార్స్,



బొంబాయిలోని తాజ్ ప్యాలెస్ హోటల్.




టాటాల వంశ వృక్షం.

టాటా ఇండస్ట్రీస్, టాటా కెమికల్స్, టాటా టీ, టిసిఎస్, టైటాన్ వంటి ప్రసిద్ధ కంపెనీలన్నిటి రూపశిల్పి ఆయనే. జెఆర్‌డి టాటా దూరదృష్టితోనే ఎయిర్ ఇండియా సైతం నెలకొన్నది. 1991లో రతన్ టాటా ఛైర్మన్‌గా వచ్చిన తర్వాత టాటా కంపెనీ వృద్ధి శరవేగంతో పరుగులు పెట్టింది. దాన్ని నాలుగున్నర లక్షల కోట్ల రూపాయల వ్యాపార సామ్రాజ్యంగా తీర్చిదిద్దిన ఘనత ఆయనకే దక్కుతుంది.

## కంపెనీలకు సేవకులు

టాటా గ్రూప్‌లోని దాదాపు 144 కంపెనీలకు యజమాని – టాటా సన్స్ అనే హోల్డింగ్ కంపెనీ. టాటా అనే బ్రాండ్ ఆ సంస్థ స్వంతం. అయితే టాటా కుటుంబంలో కన్పించే అరుదైన ఉత్కృష్టత – తమ కంపెనీలకు తాము సేవకులమే తప్ప యజమానులము కాదనే గొప్ప భావన. టాటా సన్స్‌కు ఛైర్మన్‌గా వ్యవహరించిన ఐదు తరాల పెద్దలంతా, తమ జీవితకాలంలో తాము సంపాదించిన ప్రతి పైసాను ప్రజాసేవకే ధారాదత్తం చేసి పోయారు. దానితో ఒక్కొక్క తరం మారే కొద్దీ టాటా సన్స్‌లో టాటా కుటుంబ వాటా తరిగి పోతూ వచ్చింది. దానికి బదులుగా వారు స్థాపించిన సేవా సంస్థలకు వారి వాటాలు బదలీ అయ్యాయి. తమ కుటుంబ సభ్యులెవరికీ కూడా స్వంత ఆస్తులు పెంచుకొనే అవకాశం ఇవ్వలేదు ఈ ఐదు తరాలుగా. తమ భార్యలు సైతం తమకు దక్కిన ఆస్తులను సేవా సంస్థలకు త్యాగం చేసే అరుదైన ఉదార భావాన్ని పెంచి పోషించారు వారు. టాటా కుటుంబంలోని వారెవ్వరికీ స్వంత ఇల్లు లేదు, స్వంత కారు వుండదు, స్వంత పొలం, పుట్రా అసలే వుండవు. కంపెనీ కుర్చీతోనే వారి జీవితాలు గడిచిపోతూ వస్తుంటాయి. భార్యా పిల్లలకు కొండంత ఆస్తి కూడబెట్టి వెళ్లాలని మనబోటివారం పడే తాపత్రయం టాటా కుటుంబంలో కాగడా వేసి వెతికినా కన్పించదు. అందువల్లనే వారి మాతృ సంస్థ అయిన టాటా సన్స్‌లో గత ఐదు తరాలుగా టాటా కుటుంబీకులు స్థాపించిన స్వచ్ఛంద సేవా సంస్థలకు దాదాపు 69 శాతం వాటా ఏర్పడింది. ప్రస్తుత కంపెనీ ఛైర్మన్ రతన్ టాటాకు ఆ సంస్థలో వున్న వాటాలు కేవలం 3368 మాత్రమే. వాటిని కూడా ఆయన తన పదవీ విరమణ తర్వాత తన పేరుతో ఏర్పాటు చేసే సేవా సంస్థకు త్యాగం చేయబోతున్నాడు. సర్ దొరాబ్జీ ట్రస్ట్, సర్ రతన్ టాటా ట్రస్ట్, సర్వజనిక్ సేవా ట్రస్ట్, ఆర్‌డి టాటా ట్రస్ట్, టాటా సోషల్ వెల్ఫేర్ ట్రస్ట్, టాటా ఎడ్యుకేషన్ ట్రస్ట్, జెఆర్‌డి టాటా ట్రస్ట్, ఎంకె టాటా ట్రస్ట్ వంటి ధార్మిక సంస్థలకే ఈ కంపెనీలో వాటాలు అధికంగా వున్నాయి. కంపెనీ రాబడి ద్వారా వచ్చే ప్రతి పైసా ఆయా సంస్థల లక్ష్యాలకు అనుగుణంగా సేవా కార్యక్రమాలకు ఖర్చు చేస్తారు. అందువల్లనే టాటా వ్యాపార సామ్రాజ్యం కుబేరుడు కుళ్లుకునేంత గొప్పదిగా ఎదుగుతున్నా, ప్రపంచ కుబేరుల జాబితాలో టాటా అనే పేరు కన్పించదు. తమ కంపెనీలను కుబేర స్థానంలో నిలిపి, తాము మాత్రం కుచేలుర వలె



కొత్త ఛైర్మన్ మిస్త్రీ.

కొరవ 14వ పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com